శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః.




ఇది

## శ్రీ తిరుపతి వేంకటేశ్వరులచే

రచియింపఁబడినది.





రెండవ కూర్పు.



కాకినాడ.

కాకినాడముద్రాక్షరశాలలో
ముద్రింపించి ప్రచురింపఁబడియె.



తిరుపతి వేంకటేశ్వరులు,

శతావధానులు.

# ఉపోద్ఘాతము.

20 4/5 -



ఈకల్పితప్రబంధము పుచ్చా సీతారామయ్యగారి కంకితమీయఁ
బడినది. ఇది యధికప్రయత్నముచే నను బలవంతపెట్టి యతఁడే రచి
యింపఁజేసినాఁడు. తుదకు జరుగకపోయినను మాకాయన చేయుఁద
లంచుకొన్న బహుమానము వేయిన్నినూటపదార్లు. ప్రకృతము గ్రంథ
నేత మృతిచెందినను దీనినిరచించి వినిపించినపిదప నాలుగుసంవత్సర
ములవఱకును చక్కఁగాజీవించియుండి మొదటఁ బ్రతిశ్రుత మొన
ర్చినధనము నీఁజాలక యేదోమిషపెట్టి నానాఁటికి మాకు విసుపుపు
ట్టించి "ఇఁకనితఁడు సమ్మానించినను స్వీకరింపఁగూడ" దనునభిప్రాయ
మును బూర్తిగాఁగలిగించి యట్టి యుత్తరముగూడ మావలననందు
కొనెను. ప్రప్రథమము చిత్తుకాగితములమీఁదనే పుస్తకమును బూ
ర్తిగావిని పరమానందమునంది వెంటనే యచ్చొత్తింప నెంతోయత్న
మొనర్చి "సమ్మానానంతరమునఁ గాని ముద్రణమునకు వలనుగా"
దని మేమడ్డుపెట్టుటచే నించుకయుఁగ్రహించి పైమొత్తమునకు నోటొ
కటి వ్రాసియంపెను. వెంటనే దానిపై వసూలుపెట్టి తిరుగఁగొట్టితిమి.
పదపడి కొన్నాళ్ళ బందరుపురమ్మున నే యుండెనుగాని ధనలోభ
ముచే సమ్మానముమాత్రము జరిగింపఁజాలఁడయ్యె. అనంతరము తన
యగ్రహారగ్రామమగు సిరిపురమునకు వాసముమార్చికొని యటనుం
డి యుత్తరముల మూలమున సమ్మానించు నభిప్రాయమును తెలిపు
చ్చుఁజొచ్చెనుగాని దైవ మనుకూలింపమిచేఁ గృతార్థుఁడుమాత్రము
కానేరఁడయ్యె, తక్కినవిషయములెట్లున్నను నితఁడు ధనవ్యయమునకు
మాత్రమించుకయు వెనుదీయువాఁడుకాఁడు. దాతృత్వముతోఁ బాటుగా
నవ్యవస్థిత చిత్తత్వమీతనికి సహజగుణము. "అవ్యవస్థిత చిత్తస్య ప్రసా

దోపి భయంకరః" అనికదా? పెద్దలు చెప్పుదురు. కావున నిట్టివానికంకిత
ముగాఁ గృతిచెప్పుట మాలోపమేయని మేమువ్రాయుచున్నను లోకము
నిశ్చయించుకొనక యెట్లుమానును? ఇతఁడంతలో దైవవశమున మృ
తిచెందెను గాని జీవించియున్నను సన్మానము చేయఁజాలఁడనియే మా
నమ్మకము. సన్మానము కేమి? అతఁడెట్టివాఁడైనను "యశముకొఱ
కుఁగదా? అతిప్రయత్నమునఁ గృతిచెప్పించుకొనుట" యనియూహించి
"మరణాంతాని వైరాణి" యనుమాట స్మరించి యీమాకన్యక నతని
పేరుమీఁదనే ప్రకటించితిమి. వితంతూద్వాహమంతగాఁ దప్పులేనియి
కాలమున నీకన్యకకు బాల్యవైధవ్య మనుభవింపవలసినంత నిర్బం
ధనము లేశమును లేదు గాని యేమైనను నన్యథాకరించుటకు మనసొ
ప్పినది కాదు. దీనిని సహగమనము చేయించవలెనను నూహ కూడ
నుదయించినది కాని, యదియిప్పటి శాసనమునకు విరుద్ధమని తిరిగి
యణఁగిపోయినది. పదపడి యీవిశ్వస్తకు భరణప్రాప్తి కలుగునను
కొనవంతి కలిగినది. "కాకమాంసం తదప్యుచ్ఛిష్టం స్వల్పం తదపి దుర్లభం"
అనురీతి నున్న యీ భరణమునందును మాకృతికన్యకిష్టము లేదు....
గుణదోషములు రసజ్ఞలోకమే నిర్ణయింపఁగలదుగదా? యని......
..............యింతటితో నీయంశమును ముగించుచున్నాము.

తిరుపతి వేంకటేశ్వరులు.

# ద్వితీయ ముద్రణపీఠిక.



చదువరులారా ?

ఈ కబ్బమునుగూర్చి వ్రాయఁదగు నంశములన్నియు మొదటి పీఠికయందే వ్రాయఁబడియుండుటచే నిపుడు నూతనముగా నిందు వ్రాయఁదగు నంశము లెవ్వియును లేవు. కాని ముద్రాయంత్రమునందలి యక్షరములు బొత్తిగా నలిగియుండుటచేఁ బ్రతిపుటయందును నెన్నియో యంటనిచోట్లు కలవు. అందు "ం, స, వ, మ, గ, వి, ఈయక్షరములు చాలభాగ మంటనే లేదు. మఱికొన్ని యక్షరములుకూడ నంటనివికలవుగాని వీనివలె బొత్తిగానంటకపోలేదు. ఇంక ప్రూఫుచూచువారి ప్రమాదమువలనఁ గలిగిన లోపములు మాత్రమీక్రిందఁ జూపి విరమించుచున్నాఁడను.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 2 | కఁట | కట |
| 6 | 4 | నేమమూ | నేమమో |
| 6 | 20 | భంబు | భంపు |
| 8 | 12 | స్సైక | స్నైక |
| 8 | 23 | గూఱ్ఱు | గుర్తు |
| 8 | 24 | జాతి | జాతికి |
| 14 | 18 | లోగ | లోఁగ |
| 15 | 23 | ముస్యు | మునెస్సు |
| 19 | 3 | జని | జాతి |
| 19 | 12 | బెంకి | బెంకె |
| 20 | 14 | ల్లాలి | ల్గాలు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 24 | 24 | నొక్క | కొక్క |
| 25 | 6 | లును | లను |
| 26 | 27 | వ్యా | వ్యాని |
| 27 | 11 | ఁగుటిఁ | గుటి |
| 27 | 15 | గోర | గోరి |
| 30 | 13 | నిచ్చలు | నిచ్చల |
| 33 | 24 | గ్గునడ | గ్గుండ |
| 34 | 8 | బిడ | బిడి |
| 38 | 9 | తఁగా | తిఁగా |
| 38 | 9 | మురన్ | ముఁన్ |
| 38 | 15 | యమున్ | యముం |
| 39 | 10 | దజలె | దఁజల్లె |
| 42 | 1 | డునున్ | డుమాన్యుఁడునుఁ |
| 44 | 7 | చెప్పిన | చెప్పినన |
| 46 | 9 | చెనటి | చెనఁటి |
| 46 | 27 | నీటి | నీటు |
| 47 | 4 | భుజఁగు | భుజగు |
| 50 | 8 | దుందు | తుందు |
| 50 | 10 | నది | నయది |
| 51 | 3 | లేద | లేవ |
| 51 | 20 | నొప్పు | నొప్ప |
| 52 | 4 | బోవు | వోవు |
| 54 | 17 | టొప్ప | టొప్పు |
| 58 | 1 | సత్న | సత్వ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 58 | 4 | సూపి | జూపి |
| 59 | 10 | వటందు | వటంచు |
| 60 | 2 | దున | దన ? |
| 61 | 5 | జల | బల |
| 62 | 3 | యిచు | యించు |
| 66 | 10 | స్యాందా | స్యానందా |
| 68 | 23 | వేళ్ళనో | వేనోళ్ళ |
| 70 | 10 | దేని | డేని |
| 70 | 11 | గుర్తె | గుర్తై |
| 76 | 7 | మీాతని | మాతని |
| 77 | 22 | సందు | నందు |
| 78 | 4 | త్రోష | రోష |
| 83 | 23 | ట్టుల | నట్టుల |
| 88 | 24 | చవు | చనవు |

ఈచూపినవి ముఖ్యమైన ప్రమాదములు అంటలేదని మొదట సూచించిన పూర్ణానుస్వారములోనగునవి దిద్దనేలేదు. అవి తఱుచుగా బ్రాసస్థానమందుఁగూడ నున్నవి. కావున దిద్దకున్నను సులభముగాఁ బ్రాసస్థానమందుఁగూడ నున్నది. కావున దిద్దకున్నను సులభముగాఁ దెలిసికోవచ్చును. అట్టివి కొన్ని యితరస్థలములయందును గలవు. ప్రాజ్ఞులే ప్రమాణమని యుపేక్షింపఁబడియె.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి,
శతావధాని.

# శ్రీమత్పరదేవతాయై నమః.

# పాణిగృహీత.

## (తిరుపతివేంకటీయము.)

### ప్రథమాశ్వాసము.



శ్రీదుం డాప్తుఁడు గౌరి భార్య, యచలశ్రేష్ఠమ్ము వాసమ్ము, వి
ఘ్నాదుల్ వాపెడివాఁడు పుత్త్రుఁడు, శుభం బర్పించుశబ్దమ్ము పే
రై దైవారెడివేల్పు నిత్యకరుణావ్యాప్తుండు పుచ్చాగ్ర్యయున్
దాఁ దాత్పర్య మెలర్పఁ బ్రోచు నలసీతారామనామాంకితున్. 1

చ. గురు వగుబ్రహ్మపండితునకు న్నతిసల్పి జగత్ప్రసిద్ధవా
గురు లగుసంస్కృతాంధ్రకవియోగుల మ్రొక్కియు నేఁటి మేటులన్
గరము బహూకరించి యిఁకఁ గాకవితాభువనైకరాజ్యభా
స్వరులగు నామమాత్రకవిచంద్రులకున్ బొనరింతు మంజలుల్. 2

తే. గీ. లజ్జ గల్గిన పూర్వకాలమ్మువారుఁ, గోటి కొక్కఁడు గల్గెఁబో! సుకవి, నేఁటి
కాలమం దేమికర్మమో కవులమాటఁ, దొంబదులు సుపదమ్మునఁ దూఁగుమందు. 3

ఉ. కైత యొకండు గా దిపుడు కాలము సర్వము మాఱె వ్యర్థపుం
జాతురి హెచ్చె నల్పమగు సాహితితోఁ బెదపెద్దపత్త్రముల్
చూతురు తప్పొ దిద్దుకురు, చూరత చచ్చెఁ గవీంద్రులందు సీ!
మాతులు గట్టిపైచికొనఁ బోలదె? సత్కవులైనవారికిన్. 4

చ. తగుదుమొ లేదొ యంచు మదిఁ దత్తరపాటొకయింత లేక "మీ
దగుకయితమ్ము సూచితిమి సూంద దిదుం దిది" యంచుఁ బత్రముల్
దగులుతు రందుకోసమె మొదల్ దమ రచ్చు రిక్కవుల్ వృథా
యగుఁగద! వీరిసమ్మతు, లహో! తగువారి కివేల? కాల్పనే. 5

తే. గీ. అన్నిపాత్రములకు మొదలెన్నిపట్టులా, నింకు నభినందనములతో దండుగకట్టు
యొక్కఁడేనియు నిజముగ నూహ వ్రాయఁ, డట్లు వ్రాసిన నద్దాని నడఁతు రొకట. 6

తే. గీ. భారతముపై నెవరియభిప్రాయ ముండె, మనుచరిత మొదలేరిసమ్మతులు నిలిచెఁ
దీపి లేనిఫలమ్ములపైఁ దేనెచిలుక, నేమి యగుఁ దీపి గలదాని కేమివలయు, 7

తే. గీ. చేతఁ గానిశతావధానిచేతిబిడ్డ, సర్టిఫికెట్లుకట్టులే, సహజశక్తి
గలుగువారల, కవి యేల? కాల్పనే స్వతఃప్రకాశుఁడు గోరునే? తనకు దివ్వె 8

క. "సంగీతసాహితులు వా, గంగనకుఁ గుచము" లనుట "హాస్యాస్పద" మం
చుం గన్నులుగా దిద్దెడి, శృంగారవిదుల్ కవీంద్రు లిక్కాలమునన్. 9

ఉ. ఇంతకు నింత మాటలె నిఁక నిన్ని యనంబులుగూడఁ జుంబనా
శ్లిష్టతము లోటు మోటనుచుఁ గాళ్ళకు మార్తురొ వ్రేళ్ళటందురో
తింత్రిణికాఫలమ్ము లనఁ దీఱదె? పూర్వకవీంద్రు లక్కటా!
యింత వివేకముం దెలియరే? యది దిద్దెడిపాటివారమే? 10

క. స్తనశల్యపరీక్షకుఁ బో, యిన ఫలముం గలదె! వాని నిటుపోల్చిన య
య్యనఘునిభావము నెఱిఁగిన, జనుఁ డేగతి దిద్దు? నది రసం బెటు లిచ్చున్. 11

తే. గీ. ఇంతమార్దవ మెఱిఁగియు నిహిహి! మీరు, బాలకుల కంచుఁ జేసినపాఠపుస్త
కమున నుఖరోగములగతి నిముడఁజేసి,రటనుపాధ్యాయు లెటుచెప్పనగునొ? యకట!

ఉ. కంకురకుంక లైనపలుగాకికలార్థుల కెట్లు పార మీ
యంకుపురాణముల్ నయభరప్రద మంచు వచింప నొప్పు? సా
శంక యొనర్పరే? నగరె? "సర్వము నీతికె" యందురేని మీ
సాంకుని బెల్పు నారతిరహస్యము పాఠము పెట్టరాదొకో! 13

తే. గీ. తగినసామగ్రి దొరకిన ధార లేదు, ధార గల్గిన సామగ్రి దవరఁబోదు
రెండు గల్గినవారితో నొండు గల్గు, వారు డీకొన నది సగుఁబాటు గాదె? 14

ఉ. కొంచెము గొప్ప సంతసము గొల్పినఁ జూడుఁడు చించివేయుఁ డే
మంచియు లేనిచో, నివియె మా నమనమ్ము, లనుగ్రహించి మ
న్నించుఁడు శారదాబుధనేతవిధాన వృథావివాదముల్
పెంచకుఁ డాగ్రహించకుఁడు "పెప్పెపె" యందురు మే మెదర్కొనన్. 15

చ. పరిణతశక్తు లైన యలభారతపుంగవు లట్టు లుండ ము
ప్కురఁ దనిపించుకొన్న కవిసామజసింహము రామకృష్ణ వా
గ్విరచనగూడఁ జూడుఁడు ప్రవేశఫలమ్ములు చిన్నచిన్న వ్యా
కరణపుఁబొత్తముల్ గొణిగి కయ్యముఁ బెంచకుఁడయ్య! వాగ్విదుల్. 16

క. తొలిబాసయందుఁబలె నీ, తెలుఁగుంబాస వెలయించుదీపము లేమిన్
విలువగలకవులలక్ష్య, మ్ములె తా మీభారమెల్ల మోయఁగవలయున్. 17

క. ఈభాగము మే మల దే, వీభాగవతమ్మునందు వివరించితి మీ
క్షోభ యిట్టు మరల నేల? ప, రాభవ మందరుఁడు పైకి రాకుఁడు సుకవుల్. 18

ఉ. కాలముఁ బట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంచి దేశభా
షాలలితాంగి మాఱు టది సత్కవిసమ్మత మౌట నవ్యదే
శ్యాలను నాంధ్రభాషఁ గలపౌటను నౌచితిఁబట్టి మేము క
బ్బాలను వాడుచుంటి మని పండితు లేగతి నొప్పరుందురో. 19

మ. అగుఁ గావ్య మ్మిది, యైనను న్బ్రహసనప్రాయమ్ము, ప్రారంభమా
దిగ దీనన్ బలుచోటులన్ బొసఁగు నెంతేనిన్ రసాభాస, రో
మగునన్ నాయికచేఁత, దుర్విటులనిర్మర్యాదవాక్యమ్ము, లొ
ప్పుగ దానిన్ వెలయించుఁ బండితులు తప్పుల్ దీతురేమో కదా! 20

తే. గీ. కవిత యన్నపు డెవరివాగ్రచన యెట్లొ, దాని కనుకృతి సేయుటే తగినఫణితి
అంతియే కాని యొల్లెడ ననుగుణపు, శైలి గల్పించు టది యేట్రిచంద మగునొ! 21

తే. గీ. మాలపల్లె వర్ణించుచో మహీసురులను, జెప్పుగతి దుర్విటులు వాడుతప్పుమాఁట
లెంతమృదువుగా మార్చినఁ గొంతయైనఁ, బచ్చి యుండక మాన దప్పట్లు నిజము. 22

క. అనరాదు గాని యప్పక, విని "గనులున్ జనులు మొదలు వేయఁదగని" వం
చనియె నివి భారతాదులఁ, గనుఁగొనెనో లేదొ, శతము గన్పడు నకటా! 23

ఉ. తా నొనరించుకట్టునకుఁ దప్పినపొత్తము లెన్నియెన్నియో
మానుగ లక్ష్యసంగతుల మన్ననచేసి యదేమిపాపమో!
మానెను బోతరాజకవిమండనువాగమృతంబు గ్రోలతే,
కైనను దోసముల్ గలవె? యయ్యెడఁ జక్కఁగఁ జూచువారికిన్. 24

ఉ. ఱాకుకు రేఫకుఁ జెలిమి రాదని పెద్దవివాద పెంచెఁ దా
నేకళనుండి వ్రాసెనో కవీంద్రుఁడు నన్నయ, కల్పమూనినా
రే? కవు లొక్కరే, మధురరేఫలెయ్యవి? నణల్, శసల్, లడల్,
గాక యభేద మీరొకటి గా? తగదుంచుట, మేలు మేల్! బళీ! 25

శా. శ్రీనాథాదుల తేనిలోపములు వర్ణించెన్, దలాభేదసం
ధానంబున్ దెఁదెంచి దిద్ది, యది గన్నన్ నవ్వరే! శాబ్దికుల్,
తా నేయేయవి లేవనెన్ దనకు సంతర్వాణు లాసత్కవీ
శానుల్ వాడిరి విస్తరించుటకు శాస్త్రం బెట్లు వీ లియ్యెడన్. 26

క. ఎటేఁగి ప్రయోగించినదో, యెఱుఁగనిదో తెలియవలయు నిచ్చో నలవ్యా
కరణపుభాష్యములో వ్రాసి, సిరి చీవాట్లిడిరి లక్ష్యసిద్ధి దెలుపుచున్. 27

క. ఎన్నెన్ని పొత్తములు కవు, లెన్నెన్ని విధాలఁ జెప్పి రెన్నెన్ని విశే
షోన్నతు లరయ్యడఁ గన్పడు, నన్నియుఁ దెలియంగ శక్యమా? యొక్కనికిన్. 28

తే. గీ. వాడిదౌర్బల్యమే కాని లేదు వాద, దుర్బలత్వము, లక్ష్యముల్ దొరక వనుట
బొత్తిగాఁ దప్పు, తెలుఁగున బొంకి రిట్లు, సంస్కృతమ్మున నింతగా సాగ దాటు 29

ఉ. ఇంతరుఁ బోతరాజకవి నీశుఁడు దాఁ బహిపెట్టె దానిచే
నింత లిఖింపఁగావలసె నిందుకుఁ దిమ్మకవీంద్రుఁ డేమి, ను
ప్యాంకులు తక్కులాక్షణిక లందఱు నేమి, యెదిర్చి యక్కవిన్
గాఁతికిఁ దెచ్చి గప్పకవి కా దనుమాత్రములోనఁ బోయెనే. 30

మ. యతియో ప్రాసయొ తప్పు టేరికిని రాదా? దానఁ బాండిత్యవి
స్ఫూర్తికిన్ లోపమె? భ్రాంతి పండితులకే, "యేవార్థమప్యర్థ్యయ"
స్మృతిపూర్వోక్తి దలంపుఁ డొందఱును దా మీపూర్వపుంబొత్తముల్
వతి మన్మఖ్యులు దిద్దకే కలిగెఁ బ్రామాణ్యమ్ము, యోజింపుఁడీ. 31

ఉ. వారికి నిచ్చకమ్ముగతి వారును వారును దిద్దలేని యా
భారతమాదిగాఁ దెలుఁగుబాసను సంస్కృతమందు నొక్కచో
దారిని బోవు పాఠములు, దానికిఁ గారణ మేమి? యిప్పుడు
ఖ్రారఛశాలయమ్ములకు దప్పులొప్పులు కొన్ని చొప్పడున్. 32

వ. అని శిష్టాచారచ్ఛలమ్మున సూత్రప్రాయమ్ముగ నించుక చర్చించి యొక్కఁడు గార్గ్య
వశమ్మున బృందావనపురమ్మున కరుగుటయు నయ్యెడ నాబాల్యమిత్త్రుండును నవా
దిపవిత్రతర పుచ్ఛావంశసంభూతుండును గానరసకోవిదుండును గవితామాధురీసురీ
ణుండును నగు సీతారామనామకవిప్రధనదతనూజుం డొక్కఁ వాఁడు.

ఉ. తా నొకపార్శ్వమునన్ శ్రుతిసుతారముగాఁ దగుదాని నూని డెం
దానఁ బ్రీతి గొల్పఁగతిఁ దానముఁ బల్కఁగఁ జేయుచున్ మఱిన్
దానికి వేఱు గానిగతిఁ దంబుర మీటుచుఁ గొంద ఱెల్ల "రా
నా" ననురీతిఁ బాడ నది హాయిగ వించుఁ దదేకచిత్తుఁడై. 84

వ. కొండొకసేపు విస్మృతసకలప్రపంచుండై కాలక్షేప మ్మొనరించి చిఱునవ్వు నవ్వు
చు భక్తిపురస్సరమ్ముగా నిట్లనియెను. 85

చ. "తిరుపతివేంకటేశ్వరులు తియ్యనిమాటలతోడ నూతి పా
మరులను మెచ్చఁగాఁ గవిత మంచిగఁ జెప్పెద" రంచు వించు సం
బరపడుచుంటి గాని యొకపాటిప్రబంధము నైనఁ గైకొనన్
జిరముననుండి యత్నమును జేసితిఁ గానయితిన్ గృతార్థుఁడన్. 86

తే. గీ. ఆత్మకూరునృపాలునియట్లు మిమ్ము, సేనఁగంబారి శిక్షింప నేమి గాని
తక్కుసమ్మాన మొనరింపఁ దగినపాత్రి, సిరి గలదు నుంతు నాకు లచ్చిపతికరుణ. 87

చ. అన విని "నీ కొసంగు టొకయబ్బురమే? మఱి విప్రులందు నేల్
ధనమున దాతృతాగరిమఁ దక్కఁ బ్రశంసల నూటనాఁటఁ ద
క్కఁ గలరే? నినున్ దొరయకీర్తిపరుల్, కయికొ మ్మవశ్యమున్
మనమున కిష్టమైనకృతి మాన్యతనున్ దగుదాని" నావుడున్. 88

ఉ. ఇప్పటికెంత లేదనిన నిర్వదికిన్ బయినుండు మీకృతుల్
తప్పక సేయ వాళ్తవధానపుఁబద్దెములున్ నృపాళిపై
గుప్పినపద్యముల్ గలవు కొల్లలు, భాగవతంబు దీనిలో
గొప్పది, దాని నేను మనుగోంటి, నీ యకపోతె రెండునో? 89

మ. ఋతువుల్ పర్వతముల్ సముద్రములు నీరేజాకరమ్ముల్ శత
క్రతుముఖ్యామరసంఘముల్ తెలుపఁగాఁ గబ్బమ్ములం దైతెడన్.

శ్రితులన్ దన్పుచు నటంచేసి యిఁక నేఁ జోద్యమ్ముగా నూత్నపుం
గృతి నిర్మింపఁగఁగోరెదన్ నయమునన్ శృంగారమున్ మీఱఁగన్. 40

చ. మనుజున కెద్ది యోగ్యతయొ మానినియందుకు యొప్పునో? కుల
మ్మున కనుకూలమైన విరిబోణియె యెంచౌక నేమమా? యిటన్
మనమున నెంచిమాడ నెట మంచియిహమ్ముఁ బరమ్ము వారదో?
వినవలె దీనికెంతయును వీలగు గాథ రచింపుఁ డొప్పగన్. 41

వ. అని సకర్పూరతాంబూలమ్ము కట్టి యంబరాద్యర్పణమ్ముల సంతుష్టిగావించుటయు
నలరి యతని డెందమ్ము చందమ్ము గుఱుతెఱిఁగియు మఱింత విశదీకరింపఁదలంచి
యతనిం గూర్చి. 42

ఉ. పాణిగృహీతి యందురు వివాహితయైనసతిన్, దనంతఁ దాఁ
బాణి గ్రహించి యుంచుకొను బానిసతొత్తును శాబ్దికాగ్రిణుల్
పాణిగృహీత యందు రొక వర్గమునందునె కాక యెన్నిరా
పాణిగృహీతికిన్ గలవు పాణిగృహీతకునన్ బ్రభేదముల్. 43

ఉ. దున్నయు నేనుఁగున్ సరిగఁ దూఁగునె? యంచయుఁ గొంగ యొందు నే
నెన్నఁడుగాని సాటిగనునే? మతియొక్కఁడు కెక్కు? డక్కటా!
వన్నెయువాసియున్ సుపథవర్తనమున్ జెలువారుభార్యకున్
మున్నరికంపుఁదొత్తునకు మాధురితెల్పఁగఁగ లేరహో? విటుల్. 44

వ. అన నతం డిట్లను.

చ. విటులకు బుద్ధివచ్చునటు వేశ్యలకున్ దలవంపుగా విశం
కటపదగుంభనమ్ములను గాక కడున్ సులభంబుశైలి నొ
క్కటి రచియింపుఁడీ! కృతిని గైకొనఁ జిన్నటనాఁటనుండి మి
క్కుటముగ నన్ను నెక్కలుపుకోరిక లిప్పటి కీరికల్గనన్. 46

వ. అనుటయు

ఉ. ఇందుకు గ్రంథజాలము లనేకము లున్నవి దుష్ప్రవర్తనం
బందుఁ బురాకృతంపుసుకృతాతిశయమ్మునఁ గాలువెట్టకే
డే దము తక్కుయుండరలె డెప్పంపమై యటుగాక తక్కునన్
విందుమె? యొందునేనియును వెన్కకుఁ దీక్షగఁ జేయుకబ్బముల్. 46

చ. సుకృతపుబుద్ధి యూఁబకొని సుందరియే గురువ౦చుఁ దోఁచు దు
ష్కృతులె యాగమమ్ములగు జావళులే నయబోధకమ్ములౌ
నకటకటా! యొకానొకని కన్గలమై తగుజన్మ౦మున్నఁం,
దొకనికి బుద్ధిమార్పడకయుండుఁ బురాకృతపుణ్యసంపదన్. ౪౭

వ. అయినను బాటించువార లసదని నీతన్ బోధింపమానఁదగదుగాన నీమనోరథంబుచొప్పున నట్లన చెప్పెదమని యంగీకరించి యాచారమ్ము కతనఁ గృతినేతయగు నతని వంశమెక్కింత వర్ణించెదము. ౪౮

బ్రహ్మముఖోత్పన్నంబై యెక్కుడు ప్రశస్తికెక్కు నాదిమవర్ణంబునం దొక యవాంతరశాఖ యగు వెలనాఁటి వంగడమ్మునందు గౌతమసగోత్రమ్మున “పుచ్చా” నామక వంశమ్మున ననేకులు మహామహు లుద్భవించి యశమును గాంచి మించిరి. అందుఁ గాలక్రమమ్మున విశ్వనాథభొట్లు ధన్యుండుదయించె, నియ్యనఘునికి విశ్వేశ్వరసోమయాజులు జనించి యఖండ పండితుండై ప్రశస్తిన దుటయే గాక దంతులూరను నొక యగ్రహారంబు సంపాదించె. నీమహనీయు కొమరుండు లక్ష్మీనారాయణశాస్త్రి, ఈతనికి వెంకటసోమయాజియు, విశ్వేశ్వర సోమయాజియు, సీతారామ సోమయాజియు, లక్ష్మీపతి సోమయాజియు, కామేశ్వరసోమయాజియు ననునేగురు సాగ్నికులు నుదయించిరి. అంతఁ గనిష్ఠునకు సీతారామశాస్త్రి, రామయ్య, రాజయ్య అను సుతత్రితయ మావిర్భవించె. వీరిలో రామయ్యకు పూర్ణయ్య, లక్ష్మీనారాయణ, కృష్ణయ్య, శ్రీరాములు, విశ్వనాథము ననునేగురు సుతులుదయించిరి. ఈయైదుగురును సుప్రసిద్ధులే యైనను నిందు ద్వితీయుండగు లక్ష్మీనారాయణాహ్వయుండు స్వార్జితాఖండసంపత్సంపన్నుండును నిరతాన్న దాన నిరతుండును మహావదాన్యుండునునై మిగుల యశమునందె, ఈయన్నదాతయే బెజవాడలో సత్రముంచిన పరోపకారి ఈతని యన్నదాన మహత్త్వముంగూర్చి యేమి యితరయోగ్యతలను గూర్చి యేమి యెంతయైనను వ్రాయవలసియే యుండును. ఈతఁడనపత్యుం డగుటతనఁ దన పిన్నతమ్ముఁడగు శ్రీరాముని కుమారుని దత్తుఁగాఁ బిన్నఁటివాఁడై గైకొనియె. అతని పేరు సీతారామయ్య, ఈయనకుఁ గన్నతల్లి జోగాంబ, పెంపుడుతల్లి లక్ష్మాంబ ధర్మపత్ని లక్ష్మీదేవి, వీరలందఱును సద్గుణసంపన్నలు, ఈవంశము వేదవేదాంగాది విద్యలకు నాకర మనియు తద్విహిత కర్మానుష్ఠానమునకుఁ గుదురనియు నిందలి

మహాపురుషుల నామములే కొన్ని సహస్రముఖముల వాక్రుచ్చుటంజేసి యావిష
యమును మరల విస్తరించుట పునరుక్తియని యాజోలికిం బోక యీయన్వయమునం
దెల్ల నెక్కుడు త్యాగభోగరాయఁడని లోకులచే నెన్నఁబడు సీతారామాహ్వయుం
డీకృతికి నధినేత కావున నారసికునకు నభ్యుదయ పరంపరాభివృద్ధిగా మాయొనర్పన్
బూనిన పాణిగృహీతయను కల్పిత ప్రబంధమ్మునకుఁ గథాక్రమంబు. 49

ఉ. పత్తన మొక్కఁడొప్పు "హరిపావకముఖ్య దిగీశలోక సం
పత్తులకెల్ల నొక్కయెడఁ బద్మభవుం డిరవొందఁ జేయఁగాఁ
జిత్తమునన్ దలంచి యిది చేసె నిజ" మ్మని యెల్ల పాండితీ
వేత్తలు దన్నుతింప నరవిందసమాఖ్యఁ బరిమళించుచున్. 50

మ. నదికిం దాపఁట చుట్టుపట్టులను సానందమ్ము పుట్టించుచె
ల్వావన్ వర్తిలు తోఁటలొప్పునఁట వాయుప్రేరణన్ సౌరభా
భ్యుదయం బెప్పటికప్పు డుండునఁట యే యుద్యోగము న్లేక సౌ
ఖ్యదశన్ జీవన మయ్యెడన్ గలదఁ టన్యం బట్టిదొం డుండునే? 51

ఆ. వె. లచ్చి యెల్లవేళలను నందుఁ గాపుర, మ్ముండుకతన దాని కొదవుపట్టి
పేరు సార్థకంపుఁ బెంపునఁదగ నేతి, బీరకాయరీతి నీఃసిలక. 52

తే. గీ. వెండికొండల మాదిరి వెల్లదీవు, లవిధమున మల్లెపూలరాశి వడువునను
సంతత సుధామహోల్లసత్సౌధ పటలి, కనులపండువు సేయునక్కటకసీమ.

మ. కనకమ్మన్నను లోష్టమన్న నరిగాఁ గన్గొంచు నన్యాంగనన్
జననింగాఁ దలపోయుచున్ నిగమవిశ్వాసమ్ము పోనీక నె
మ్మనమెల్లప్డు విరాగమంద యిడి ధర్మప్రక్రియన్ బొల్చి తా
మనసూయా పరులౌట నత్రులు సుమీ? యాప్రోలి విప్రోత్తముల్. 54

చ. అరిమదభంజనమ్మనన యాగ్రహ, మాగ్రహ మబ్బినప్పుడున్
శరణనువారిఁ బ్రోచుట యశమ్మను జ్ఞానపు మేలిగుత్తు, సం
సరణమసారమం చెఱుక, క్షత్రియజాతిఁ బెట్టెసొమ్ముల
వ్వూరమున, నేల శూన్యమయి పోవు నిహమ్ముఁ బరమ్ము వారికిన్. 55

తే. గీ. సాధుసజ్జన నామముల్ సంతరించి, యట్టి తమపూర్వపురుషుల యశము చూచి
కాని క్షత్రియకృత్యమ్ము కైకొనంగఁ, దగుదు రప్పురికోమటుల్ ధనదసములు. 56

ఉ. ఎండలవేళ దున్న రది యొద్దులగానికి హేతువంచు, బ్రి
హ్మాండము క్రిందుమీఁదయిన వాడినమాటకుఁ దిర్గులేదు వ
ట్టాండలు రామసచ్చరిత గాక యనేకపురాణజాలముల్
మెండుగఁ దామెఱింగిన సుమేధసు లప్పురి నున్నపాదజుల్. 57

తే. గీ. పూవులమ్ముటఁ గని పుష్పలావికలని, గుఱుతుపట్టుదురే కాని గొనబుతనపుఁ
బలుకులును మేనితళుకులుఁ గులుకుఁజూపు, లౌర! వారాంగన లటన్న యాసగొలుపు

మ. ఎలనీటిన్ బురణించు నీగ్గలిగి తా మేకాలమం దింక క
ప్పలతో నిండియు నూరకే యెవరినిన్ బోనీక పంకమ్ము లో
పలనున్ దాల్పక యోగిచిత్తములతేవన్ దోల్చు నవ్వీటి బా
వులు గన్గొన్న మఱెట్టి పాంథులకుఁ బోవున్ మేనియాయాసముల్. 59

తే. గీ. శాంతియార్జించుపొంతె వేదాంతములను, జమున నేటికి? క్షమకునై జపతపమ్ము
లూన నేటికి? నప్పురినున్న మత్తగజముల పవిత్రతను గన్నఁ గలుగవో కొ. 60

క. తమసహజుఁ డుచ్చపదవిన్, గొమరారుట తాముకిందఁ గ్రిమ్మరుటయు నైఁ
పమి నచటి సైంధవములు న, భమునయికిన్ దుముకు దవుసువారసిపట్లన్. 61

ఉ. తాళి యొకండు లేదనెడి తప్పిద మొక్కటితప్ప గేహినీ
లీలలఁ దమ్ముఁ జేకొనిన లేఁతబోజుంగులఁ దన్పుచున్ గళా
శాలిను లౌటకున్ ఫలమసత్యము దూరముచేయుఁ దద్ధన
స్త్రీలు నిజమ్ములం జెలఁ బతివ్రత లన్న మఱేమి దోసమా. 62

ఉ. అందొక భూసురుండు సకలాగమవేత్త యనాదిసుప్రసి
ద్ధిం దగువంశమున్ మఱియు దీప్తికిఁ దెచ్చెడి సద్గుణవ్రజం
బంది చెలంగువాఁడు నిరతాన్నవితీర్ణికి సాటుపట్టున
స్పందితచిత్తవర్తనుఁడు భాసిలు శంకరుఁ డన్న పేరునన్. 63

మ. పరకాంతాపరకీయవిత్తహరణప్రారంభముల్ సేయుము
ష్కరులన్ వీపులఁ బెట్టిఁ డొక్కరొమ్మఁ బ్రిక్కగమ్మునన్ జేసి దే
గ్గఱిన్ విన్నను హా! శివా! యనుచు లోఁ గంపించుచేకాక యు
ద్ధురితంబున్ బెడఁబాపఁ జేసికొను సందున్ లేని సత్కర్మముల్. 64

ఉ. వైదికుఁడయ్యు లౌకికప్రవర్తనమందును బ్రజ్ఞ గల్గి సం
పాదనచేసె లక్షలకుఁ బైఁ గడు హెచ్చగు ద్రవ్య, మగ్రిజ
శ్రీవత నిట్లు గాంచియును జిత్తజుబారికి లోఁగియుండె వే
శ్యావియు నేని దుర్వ్యసన మేర్పడియుండె వ్యయింపఁ డింతయున్. 65

సీ. కట్టించె మిగులఁ జక్కనిరీతి నన్నదానము సల్పనట్టిసత్రములగములు
చేయించె నెంతో చేసాచి యడిగిన బ్రహ్మచారులకు వివాహములను
శివకేశవులకు హెచ్చినభక్తి నూరూర నమరఁగాఁ జేసె దేవాలయములు
వేయించె ధర్మార్థమై యింపుసొంపారునట్టితోఁటలు నూటికన్న హెచ్చు;

తే. గీ. యజ్ఞములు సేయఁ జేసెఁ బైనందెఁ గృతుల, నగ్రహారమ్ము లొకకొన్ని యాదరించెఁ
దక్కనింక లేను సప్తసంతానములను, నొక్కసంతానమే లేకయుండెఁ గాని 66

ఉ. ఆతనిభార్య యందులకె యాత్మ సదా దిగులొందుచున్ బురా
రాతికి గౌరికిన్ సిరికి రాక్షసవైరికి వాణికిన్ సదా
ధాతకుఁ దక్కవేల్పుల కెదన్ముద మిచ్చువ్రతమ్ము లెన్నియో
చేతికొలంది దానములు సేయుచుఁ జేసెఁ బ్రియుండు మెచ్చఁగన్. 67

వ. ఇట్లుపతివ్రత యనేకకాలమ్ము నానావ్రతమ్ము లొనర్చియు వివిధనదీనదమ్ములఁ గ్రుంకులిడియుఁ దదను విసువుటయు నతండు 68

క. "అన్నతనూజునకును దాఁ, గన్నతనూజునకు భేదగతి గల్గునె?" యం
చెన్నతరూపవిశాలుల, నన్నయుఁ దనయన్నకొడుకు సాఁకఁగ నెంచెన్. 69

తే. గీ. ఎంచి తనభార్యఁ గాంచి యిట్టులనియె,"గలికి! యెన్నాళ్లిటు కష్టపడితి నోర్చి
కల్పములనన్న వ్రతములు కడఁగిచేతు?, విది పురాకృతకర్మమ్ము నెట్టులడఁచు? 70

వ. సంతానమ్ము లేకయుండుట యిహలోకానందమ్మునకె కొఱఁతఁ గలిగించుఁ గాని పర
మ్మునకించుకయు భంజకమ్ము గానేరదు. "అపుత్రస్య గతిర్నాస్తి" యని కేవలకర్మ
ఠులు చెప్పుదురే కాని యద్దాని జ్ఞాను లొప్పరు. 71

తే. గీ. ముక్తి నందెడి వానికి ముఖ్యమొక్క, జ్ఞానమగు గాని యితరమ్ము గాదు దాని
నెనయ లేకుండు నొకపాటిహీనమతుల, కియ్యదియె నొక్క తెరువని యెఱుఁగు మబల.

సీ. భీష్మున కెందఱుబిడ్డలు పుట్టిరి? శుకయోగి కెందఱు సుతులువొడమి?
రల యాంజనేయున కాత్మజులెందఱు? గణపతి కేపాటి కాన్పుగలదు?
వైవారలందఱు పడిరె? దుర్గతుల, సంతానమ్ముగల్గనెందఱు మనుష్యు
లిపుడు పిశాచాది హీనజన్మమ్ముల నెత్తుట లే దింతయేల? పుత్రుఁ 72

తే. గీ. డెంతయును యోగ్యుఁడగునేని యిహమునందుఁ
దమకుఁ బరిచర్య సలుపుట దక్కఁ బరము
నందొకింతయుఁ గాఁడు సహాయుఁ డొక్క
యెడల నగునందువేని నీ విదియు వినుము. 73

వ. పుత్రునివలన ముక్తిగలుగునని చెప్పెడిపురాణమ్ములే వారు పదితెఱంగులని యూ
నందు దత్తుఁడును బరగతికి సాధన మ్మగునని యుఘోషించుచున్నయవి
కావున. 74

క. నాయన్నకు సుతులెందఱో, శ్రీయుతు లున్నారు మొన్న చిన్నసుతుఁ డొకం
డాయుర్భాగ్యసమన్వితుఁ, డై యుద్భవమందె వాని నగుఁ గైకొనఁగన్. 75

వ. ఉదారుం డను పేరున నొప్పు వానికిప్పుడు వయస్సు మూఁడునెలలగుటయుఁ గర్మ
వశమ్మునఁ దలిదండ్రు లిరువురు గతించుటయు నీ వెఱుంగనిది కాదుగదా! అట్టి
శిశువుఁ బోషించుటయె మనకు నిహపరలోకమ్ములకు సాధనంబగునప్పు డవ్వానికి
మనసకలసంపత్తునుంగూడ నొసంగుట యెట్టి సుకృతం బొనఁగూర్ప నేరదు?
మఱియు నొక్కవిశేషంబు గల దాకర్ణింపుము. 76

చ. కనుఁగవతీరు నెమ్మొగముకాంతియుఁ జెక్కులసౌరు నాసయు
న్ననుపలికంబు చందమును ముద్దులుగుల్కెడి లేఁతనవ్వుపా
ల్పును వెసఁదైన పేరురముపోడిమియున్ మిసిమిన్ జెలంగు మే
నును గన వానిఁ బ్రాకృతజనుం డనబోల దొకించుకేనియున్. 77

ఆ. వె. "ఎచట రూపముబ్బు నచటను గొనయులు,సంభవించు"ననుచు శాస్త్రవిదులు
పల్కుచుందు రింకఁ బనిలేదు యోజింప, వాని స్వీకరింపవలయు ననుచు

చ॥ పతిఁగని యిట్లు పల్కు నలపావని "యోగ్యజనప్రియాత్మ! మీరలా
నతి యిడి నప్పుడే యదియు నాకును సమ్మతమైన నిందులో

వెనుకటి దోసముల్ గలవు వీటిఁకుఁ దై యొకసారికి వానిచే
పతనము నొందు మన్నమనుజన్మల నెందఱిఁ జూడ మిద్ధరన్. 79

చ. కలిగినవాఁడు యోగ్యుఁడగుఁ గాక యయోగ్యుఁడె యౌను గాక తా
ములుగరు తల్లిదండ్రు, లతఁ డాడిన దాటఁగ సాగఁజేతు ర
న్యుల నిఁక నున్న భేద మొకఁ డుంటుటచే మఱి యెంతమంది యో
కలిగిన మీఁద నైనఁ దమ కానుపునన్ బలెఁ జూడరెవ్వరున్. 80

చ. అమలిన బుద్ధితోడఁ దమ సత్యమురాగము మీఱఁ జూచినన్
గ్రిమముగ నత్తువాఁడొకఁడు గన్పడఁ డేఁటితనేని యేరిలో
పముననొ భేద మబ్బుట ధ్రువం, బటుగావున దత్తపుత్రికో
కమునకు స్వర్గలం బగుటకన్నను వేఱొక వెట్టి యున్నదే. 81

ఉ. వాఁడొక వేళ నత్తిఁను వానితలోదరి యత్త దేగతిన్
గూడెడి సౌఖ్య? మెట్టు లొనగూడెడి? సంసరణమ్ము, లేనిచో
లేఁ దనువంతయొక్కటియె లేదిఁకరం, బిటులైన సంస్కృతుల్
పాడఁకుఁ బెల్లుఁగ్రొత్త వివాదలు, స్త్రీపరు లుబ్బి యార్వ్యగన్. 82

తే గీ ఎందఱు జమీనుదారులు హీనులైరి, యెంద ఱగ్రహారస్థులు కుంటువోంది,
రెందఱు ధనాఢ్యు లియ్యెడ నింపుచెడిరి, గాన దత్తుఁగొనుట దుఃఖంపుతెరువు.

మ. కులవిధ్వంసకు లెందు, ముందల ముటాకోయల్, స్వకర్మస్థితుల్
దెలియన్ జాలని మాలుబాసమురతుల్, దీపించుచున్నారు పు
త్రులు కాలస్థితిఁబట్టి, యిట్టి వెడఁగుందోకమ్ములో నేమి? వీ
రలు సేవల్ పొనరింతురో? మఱి గయాశ్రాద్ధమ్ములన్ జేతురో? 84

ఉ. ఈకలికాలమందు "సుతులే పరసాధన"మంచు నెంచువా
రే కడుమూర్ఖచిత్తు, లదిగో యొకఁ డొక్కని నోటఁజూచినన్
వాడు "మస్త్రీల? తద్దినము వైదికకర్మము లెందు?" కంచు నే
సోఁకు నెవండొ యొక్కరుఁడు చూడఁబడున్ కుదియంగ మహాత్ముఁడున్.

చ. పితరులసద్గతిన్ గుఱించి పెంచుకొనం దగు నెవ్వరేని నేఁ
టి తులువకాలపున్ సలుపు రీవులు కేడుతరమ్ము లిట్టటుల్

గతిచెడి ఘోరమైన నరకమ్మునఁ గూలుట నిక్కువంబు, సం
తతికి ఫలమ్ము మోక్షగతి దాపరమయ్యె నిఁకేటి సద్గతుల్. 86

చ. అన నతఁ డిట్లు పల్కు ”నెపుడైనను గొందఱు మోక్షలక్ష్మి
లని మఱికొంద ఱుంచు టది ధీరహితం బిపుడంచు నెక్కుడై
కననగు దుష్టపద్ధతుల, కాదగు కార్యము కాకతీఱ దె
వ్వని వశమా ? యటు గానుగతి వచ్చెడి చెట్టతనమ్ము సాగఁగన్. 87

తే. గీ. ఇంతసందియ మేల ? యే నెపుడు మనసు, లమ్మనం దెన్ని యేనితరమ్ములైనఁ
గాని నేటి కయోగ్యుఁ డొక్కఁడును బుట్టి, నట్టివిన నిప్పుడిట్లేల యగునొ ? చెపుమ ?

చ. మనుజుఁడు మంచి కార్యమును మానుఁగఁ జేసెడి పట్ల "హానివ
చ్చు" ననుచు జంకఁగూడ దొకవో నయినన్ చెడు కార్యమౌని "దా
న నగును మే" లటంచును మనంబిడ రా "దిది శాస్త్రచోదితం"
బని మన మాచరింపఁదగు హాని యిటన్ సమకూర దింతయున్. 89

క, అని పలువిధముల బోధించిన సామెయు నొప్పె నంతఁ జిన్నిశిశువుఁ గై
కొని తల్లిదండ్రులైరె హెచ్చిన పేరిమను మీఱఁ బెద్దఁజేసిరి, కడుఁగన్. 90

తే గీ. ఎనిమిదవయేఁడు దాఁటకమును పె యుపన
యనము గావించి బ్రాహ్మణజనములకును
నిత్యమును గావలసినంత నిగమభాగ
మభ్యసింపఁగఁ జేసి రయ్యాత్మజాతు. 91

తే. గీ. అన్ని కార్యమ్ములల్ప సంధ్యనొగి వాఁడు, బడికిఁ జని లౌకికపువిద్యఁ బఠనసేయఁ
"బెంచుకొన్నను నిటువంటి పిల్లవాఁడు, దొరకదరో" యంచుఁ దన్నెల్లరును నతి.ప.

క. ఆకారము నైశ్వర్యము, శ్రీ కలయును నొక్కరూపు చెందిన కరణిన్
లోకోత్తర గుణగణముల, కాకరమై పొల్చె నయ్యుదారుం డెందున్. 93

ఉ. పెద్దలయందు భక్తి మఱి పిన్నలయం దనురక్తి నేమునన్
సుద్దులయందు సక్తి వెడసోయగమందు విరక్తి యెంతయున్
వాద్దు నతిక్రమించు కృతులందు నశక్తియుఁ గల్గి యెందునున్
ముద్దునుతారవున్ గొనపు మూలధనంబులు యూతఁ దొప్పెకున్. 94

మ. ఆతఁ డీరీతిని గానమందు ఘనమౌ నాసక్తి దీపింప నా
త్మ తదీయంబుగ దానికై యధికమౌ ద్రవ్యమ్ము వెచ్చించుచున్
గుఱుక మ్మొప్పఁగ నభ్యసించుచును దక్కుంగల్గు కార్యమ్ములన్
మతి పోనీయక తన్మయుండగుచు నున్మత్తాత్ముఁడై వర్తిలున్. 107

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బైన పాణిగృహీతయందుఁ
బ్రథమాశ్వాసము.



# పాణిగృహీత.

## ద్వితీయాశ్వాసము.



పుచ్ఛాకులదీపక
కోపాదికదూర గానకోవిద సుయశక
ప్రాపక దాతృత్వగుణ
శ్రీపూరిత నిత్యసదయ సీతారామా!

తే. గీ. అవధరింపు మనంతరం బతి సకల, కుసుమసంపత్తుచేత మేలికోర్కె యగుచుఁ
బస గలుగుదంపతుల పాలిపంటయగుచు, నలమె నెల్లయెడల వసంతాగమమ్ము.

శా. అక్కాలమ్మున నాతఁ డెయ్యదియొ కార్యం బుండుటం బట్టి తా
నక్కార్యమ్మును దల్లికిం దెలిపి యా యంగీకృతిం బొంది యొ
ప్పక్కక్ బాయని ముద్దరాలిఁ దనభార్యన్ మెల్లనొప్పించి తా
నొక్కండున్ జనె భాగధేయపుర మత్యుత్సాహ పర్యాప్తుఁడై. 3

ఉ. ఆపురిలోన నాటకము లాడెడివారలు పెక్కులుంటఁ దా
నేపని లేక నట్టిపని యెల్లను దీరినమీఁద నైనఁ బో
నోపక నాటకమ్ములను నొప్పుగఁ జూచుచు గానపుంజవుల్
బాపురె! యంచు మెచ్చుచును బాడెడివారలఁ గూడియాడుచున్. 4

మ. తనయూరిన్ దనయిల్లు వాకిలియు నాత్మద్రవ్యసంపత్తియున్
దనయిల్లాలిని దల్లినిన్ దనదుభృత్యవ్రాతమున్ జిత్తమం
దున నైనన్ దలపోయ కెల్లపుడు సంతోషప్రదంబైన గీ
తవినోదామృతవార్ధిలో మునిఁగి యీఁదన్ జొచ్చె నశ్రాంతమున్. 5

క. గానంపువినికి నెపమున, మానము మర్యాద యనుచు మతి నెంచక యా
యానీచులతో వేశ్యల, నైన గృహమ్ములకు నేగు నహరహ మతఁడున్. 6

మ. ధనవంతుండఁట! రూపవంతుఁడఁట! విద్యావంతుఁ డౌ వాఁడఁటే
ధననారీమణి వానిఁ జూచి మదిలోఁ దాత్పర్యముం బూన దై
నను నాతం డొకకొంతకాల మటు గానం బౌను టే కాని య
క్కనకాంగీకుచకుంభసంభృతులకుం గాఁడయ్యె లోలాత్ముఁడై.

సీ. "ఇతఁ డబ్బుచో నామనుకను నెల్లుండికే చేయింప లేదె? కాంచీకలాప
మతిపురాతన మైనయట్టి నాయిలు మేడ గాఁ బుంప లేదె? యిఱందు కన్నైన

నీ యమాయికుఁడు మాయేణాక్షి నెనసిన మఱువాఁడు గొనవచ్చు మాన్యభూమి
ధనమునకేమి యీతం డొప్పుకొన్న చో నూరక నాకూఁతు నొసఁగుదాన"

తే. గీ. నిట్లు వృద్ధవేశ్యలు తమయొకఁవలందు, "నెన్నతెన్నహామ్మ నోచెనో యట్టిభాగ్య
మున" కటంచు మాటికిఁ బ్రశంసను బొనర్ప, దిరుగు నాతఁడు మిత్రులఁ దఱచుగూడి.

ఉ. మన్నరికమ్మునన్ వసుసుమర్యను మేహహారంగు వేసపుం
జెన్నును గాంచి యెంకయును జిన్నెలు వన్నెలు వొల్చుభోగపుం
గన్నెలు "వీనివంటి యెసకమ్మునఁ బొల్చెడి కోడెకాండ్రు లే
రెన్నఁగ దేనికబ్బునొకొ యట్టి బోజుంగుఁ గూడు భాగ్యముల్." ౯

ఉ. పాడుకొలమ్మునన్ బొడమి వైకమొసంగినవానికెల్లఁ దా
నూడిగముల్ బొనర్చుచు నయోమయమైనమనమ్ము దాల్చరో
చేడెల ఫట్టువుల్ ఫలముచెందఁగ నెక్కుడనో యొకండు చే
కూడు నటాళిలోఁ గొలము గొప్పసిరుల్ గలయట్టివాఁ డొగిన్. 10

సీ. గానమ్మునం దింత కాంక్షగల్గిన వాని కేల లేకుండుఁబో! యింతులందు
లేకేమి యేలేమలీల లాతని మదియందు నచ్చెనో యెట్టు లరయవచ్చు
ముందేమొ కాని యేపూవుఁబోఁడికిని నిప్పటికిఁ జిక్కఁటంచుఁ బలుకరాదు
గానాభినయము లాకాంక్షించినంతనే వ్యభిచారి యనుటయు వలనుపడదు

తే. గీ. ఇల్లలికినంతనే పండు వెట్టులగును? నావగింజను నరభాగమైనఁ గాదు
విందుమో కందుమో వీనివిధము నేఁటి, రేపటను, డాఁగునే? లంజెకాఁపురములు.

వ. అనుచుఁ బ్రసంగించుకొనుచుండురఁట. ఇది యిట్లుండ,

చ. "నిను మదిఁగోరి యుంటి నిదినిక్కము నమ్ము" మటంచు నెన్నిగా
తినమదికోరికల్ మృదుపదమ్ములతోడ లిఖించి యంతలో
నన తెలివొందె "యేకొలము నాతికి నియ్యది గొప్పతప్పు దా
నను జెడఁబుట్టి రిక్కులమునంగల యంగన లిట్టిపట్టునన్" 12

ఉ. వా కితఁడే వశుండయిన నాకొలపుం గొనముల్ త్యజించి యీ
పోకడలెల్లఁ బోకడచి పూవులకావిబుణమ్ము దీర్చుచున్
రాఁకలు పోఁకలున్ మఱచి రాణిగఁ దద్గృహమందె యుందు నీ
బాకలి మంగళిన్ దనపు చావునకున్ మది గల్గఁజేయుచున్. 13

ఉ. ఈగతి నుల్కనట్టి తరళేక్షణయున్ మది నుల్కి యాతనిన్
లోఁగొను నట్టిమార్గమును లోఁ దలపోయని చారుగాత్రియున్
సాగ దటంచుఁ జంతిలనిచానయు నొక్కతెయోవి లేదఁటే
రాగము లేనివానిఁ ననురాగముఁ గాంచరె? యొక్కపట్టునన్. 14

ఉ. అం దొకసుందరాంగి జలజాక్షి యనన్ జనువన్నెలాఁడి తా
నెందు స్వవిద్యలందుఁ గడు నెన్నిక గాంచిన యెమ్మెలాఁడి వా
నిం దననీధి నేఁగుతఱి నిక్కగనుంగొని లోఁగొనంగ నెం
చెం దననీచజన్మ మది శ్రేష్ఠత కాకరమై చెలంగఁగన్. 15

తే. గీ. ఎంచి తనమదిలోన యోజించి తనకుఁ, దగినమేటియుపాయమొదవమి జాణ
గానఁ దనకెంతయునుకళుఁడైనయొక్క, విటునితో మంతనమునఁ దానిటులుపలికె.

ఉ. కన్నెఱికమ్ము గాకమును కాము మెఱించుక లేనియప్పుడే
పిన్నతనమ్మునన్ మిగులఁ బెంకితనమ్ములరాయనన్న లోఁ
గొన్నవిటాగ్రగణ్యుఁడవు కోటులొసంగియు నాఋణమ్ము, నీ
వెన్నఁడు దీర్పనేర విటు లెవ్వతె నిన్నుఁ గణించుఁ? జెప్పుమీ. 17

క. నగలా! నాణెములా! యే, వగలాఁడికి నైనఁ గాని వలపు నిలుచునే?
మగవాలికన్న హీననె?, నగరే? నను వాకొలమ్మునం గలకన్నెల్. 18

ఉ. పిన్నటనాఁట నన్నుఁ గొని పెంచినతల్లి ఋణమ్ము దీర్చితో !
కన్నెఱికమ్మువాఁడు నొకకాసును గొంగునఁ గట్టనేర్చితో!
వన్నెలుఁ జిన్నెలున్ గలుగవచ్చెనె? భాగ్యము లేర కాఁడ! ని
న్నెన్నఁ బనేమి? వాదుమననే కడుమెత్తని దెన్నిభంగులన్. 19

ఉ. తల్లియుఁ దల్లితల్లియును దజ్జనయిత్రియు నెన్నికొంపలో
గుల్లలుచేసి గుట్టలిడికొన్నధన మ్మది యెల్ల నల్లయుం
బెల్లముగాక నీకతన మెల్లఁగ డొల్లఁగఁజొచ్చె నింతకున్
దల్లికిఁ గాని పోకిళులఁ దాఁ జన రోఁచలి పేరు దెచ్చునే. 20

శా. "అమ్మా! అంకమునందు నీవు నను బాల్యావంతయుఁ దల్పఁడే
నమ్మం బోయను రాజునైన నొరు నైనం గాని నీచేతిలో
సొమ్ముం బెట్టిననాఁడు దక్క మొగముం జూపెట్టకే" యంచు చే
ర్పన్ మ్రాయల్, చెవి నిల్లు గట్టుకొని పోరెన్, దల్లి నిన్నాపఁగన్. 21

ఉ. అయిన నదేమి నీ వనిన నావల వేలకువేలు వచ్చినన్
గాని వృథాపరియాస మిటుఁ గన్పడినన్ మన మింద చచ్చుఁ బో
నీ వెల కొక్కరూపికయు నీ విడనెంచ విఁకెన్ని వాళ్ళ ని
న్నాని చరింతుఁ? దల్లియును నన్న కుటుంబముఁ దిట్టిపోయఁగన్. 22

ఉ. ఈపురిలోని మాకులమునింతులయం దొకవిద్దెఁ గాదునూ!
రూపమునందు నేరుపున రూఢిగ నా కెనయైన చాన నీ
వే పరికింపు మందఱును వేలకువేలు ధనమ్ము గూర్చి రే
నే పదడైతి నీకతన, నీవును రా వికఁ గొన్ని నాళ్ళకున్. 23

తే. గీ. జనని నానంద మొనరింపఁ జాలనైతిఁ, గొలమువారలలోఁ బెద్దకూళనైతి
వేలనై పరివారలఁ బోలనైతి, నేల వేయును? నీకె యిల్లాలినైతి. 24

చ. ఇతరకులమ్ము నం బోడమునింతులఁ బిన్నటినాఁడె తెచ్చి పెం
చి తగిన విద్దె బుద్ధియును జెప్పుచు నొండొకజాతిపుత్త్ర యువ
కృతుల నకుల్ స్వజాతి నఱించినభంగిని సానిఁ జేయ నా
పతి తమ కత్తె దైతయును సానులకున్ దలవంపు నింపుచున్. 25

చ. అనుచు నొకప్పుడున్ వినని యప్పలుకుల్ చెవి సోఁకినంత న
వ్వనిత దాసుఁడైన విటవల్లభుఁ డుల్లవ గుండె జల్లనన్
గన లుపయింప నాఁచికొని తా దని యా వని పల్కలేక లో
నను క్రాసి నిట్లు "ఛీ! పడపుత్తుఁగన లిట్టిర" యోసికేనియున్. 26

చ. నను గనికాని భోజన మొనర్పదు నన్విరికాని యన్యమున్
విన దొకవేళనైన నను వీడి యొంటిగ దర్వమన్న మా
టన వినరాదు దీనివ్యాపయం బిపు డెంతటిలోన మారెను, "రో
వనితల పేర్మి కల్ల" యనువార్తలసత్యము లెట్టులో? భువిన్.

చ. జనని యొనర్చుబోధములచందము దాఁ దలకెక్కి యుండునా?
తనచెలికత్తెయల్ పలుపుతంత్రము లాత్మఁ గలంచియుండునా?

ననుఁ దలఁదాఁటు నింక నొకనాయకునిన్ వరియించి యుండునా!
కనికర మింతలేక యిటు కాలుల [illegible] కేమిహేతువో. 28

చ. తనపసిపాపయందు నిటు దైవముగాఁ గనునన్వెలందియే
చనఁ జన మోటువాటి యొకచందమునన్ గనుఁ జూల్కఁజూచు లోం
గినకొలఁదిన్ మఱింత పణకించును సేవకుకన్న హీనుఁ గాఁ
గను నిది తుచ్ఛజాతులకుఁ గాక మఱొక్కఁటఁ గల్గ నేర్చునే. 29

వ. అని యచ్చెలి నుద్దేశించి.

తే. గీ. అడిగినను తమ్మి దివ్యమ్ము లడుగకున్న, రాకపోవునె? మర్యాద రాదుగాని
మగువ! "యేడ్చినదానికి మగఁడువచ్చి, యేపులాడికిన దానికి రాకపోఁడు."

తే. గీ. మొదలఁ దా నెంతచేసినఁ దుదకునొక్క, మాటతో నదియెల్లను మట్టుపడును
వినవె! యీసామెతనునీవు వనజనయన! "నూఱునోములు ఒంకతోఁ దీఱిపోవు" 31

చ. తన మనుమాట వేశ్య కునుదానికిఁ దోఁచన నీదపోతె నం
డినయది యే, తగుంగతి గడింపకలేన్ పనుయమ్ము మాని, యీ
నినయపు డావు పాలిడదె? నీటి నొసంగదె? వర్ష కాలమం
దున జలదమ్ము. లింత మదిఁ దోఁచని దానికిఁ జెప్ప నేటికిన్. 32

క. అన జలజాక్షియు మోమున, మనువగవు నెలంగ నొయనుంగుబోటింగా!
నిను తన మిమ్మకుటున బెస్త్రినె! యెక్కడఁదెత్తు! వది, యెటింగింపు మెగిన్. 33

వ. ఇట్టిపట్టునఁ గృష్ణునకు నొక గొల్లచేడియ చెప్పిన సమాధానమ్ము గల దా
కర్ణింపుము. 34

మ. జనన మ్మాదిగఁ బొట్టనించితివి గా! చౌర్యమ్మె కార్యమ్ముగా
తన మొక్కింతయు నీయకే వ్రజసతీదాంపత్యముల్ గొన్న నీ
జననంబుల్ పదికోటు లిబ్బు మను దీర్చన్నెర్చునే! యట్టి, నీ
కును నేమున్నది! యేమొసంగెద! వహో! గోపాలచూడామణీ. 35

వ. అని యాజలజాక్షి యుతనిన్ గొంతబుజ్జగించి మఱియును. 36

మ త్తకోకిల గాన మన్ మిమచేతఁ గొందఱఁ గన్నెలన్ వలపించి యా
మైని నాట్యపటుంచుఁ గొందఱి బాలలన్ గికుళ్లిద్దిమ్ముకా

మానవాణకళాప్రవీణతఁ జూపి కొందఱేఁ బ్రోడలన్
మానభంగ మొనర్చునీవురు మా కొసంగెడి దేమిటో. 37

ఉ. కావున నిన్ను నేను ధనకాంక్ష మెయిన్ జనవాఁటునుండియున్
బూవిలుకానిముచ్చటలఁ బొందఁగలే దిది నిక్కువంబు, నే
నేవిధినైన జన్మ మిది యెంతకునుండునొ యంతవట్టు నీ
తో విడకుండుటే నిజము తొంబదివిఘ్నము లిందు వచ్చినన్. 38

క. మనచెలిమికి భంగ మ్మొందుదు గల్గకయుండునట్టి త్రోవను ద్రవ్యం
బును నార్జింపఁగవలె నే,మన! ద్రవ్యము లేమి నెట్టులగుఁ బోషణముల్. 39

ఆ. వె. "కూరుచుండి తినిన గుల్లగోపురములు, నాటు" నన్నినాళ్ల కగును నింట
నున్న ద్రవ్య మింక నొండొక్కసమపాయు, మెద్దియేనిఁ జూచుటే హితంబు. 40

క. ధన మెంత నీవొసంగిన, గొన నది యేమంటివేని? గూఢమ్ముగ వ
ర్తన గల్గుప్రియునిపై మన, మెనసినగతి నుంచుకొనిన నెనయుదు వింటే. 41

ఉ. ఎంతధన మ్మొసంగినను నెన్నివగల్ మొయినిండ వైచినన్
గాంతుఁ డొకండు వేఱొకఁడు గావలె నిష్టుఁడు రోవెలంది, కీ
యింతుల మర్మకర్మము లొకింత యెఱుంగ రహా! జమీనుదా
ర్లంతిపురమ్ములం దిడుదు రందును మానవు మాప్రవర్తనల్. 42

గీ. అభినయమటంచునో గానమనియొ వైద్య,మనియొ మఱియెద్ది సేవమిష యనావుపటుచి
తనకుఁ బ్రియుఁడగువాని నంతఃపురమున, కళ్ళమమ్మున రప్పింతు రజ్ఞముఖులు. 43

క. అది యేమికర్మమో తొం,బదిలక్ష లొసంగి నేని మదనుండైనన్
గుదురదుమన మిక్కుటశిల, కద నెఱిఁగినయట్టివిటునియందుం బోలెన్. 44

మ. ఇదియే నిక్కముగాకయున్న విను మీ పీయూరనే కాదు తొం
బదియూళ్లన్ గనఁగొమ్ము ద్రవ్యవహితుల్ మాజాతి పూఁబోఁడులన్
బదిల మ్మొగతి నుంచుకొంటురును నప్పద్మాత్ము లింకొక్కనిన్
గదికెన్ దూతిక నంపి తెచ్చుకొనుటే గన్పట్టు నీ కల్లెడన్. 45

ఉ. కొందఱు వెఱ్ఱు లయ్యెడలఁ గొండొకమానిసి ద్వారమందుఁ గా
పుం దగు జీత మిచ్చి యిడిపోదురు వాని కొకింత యిచ్చినన్

జందనగంధికిన్ విటుని జయ్యన వాఁ డొనఁగూర్చెఁ గొన్నిచో
ట్లుం దగ వాఁడె యా విటుఁడు; లంజెలనైజము లెన్న నేటికిన్. 46

ఉ. నమ్మవుగాని నీకు నొకనాతి చమత్కృతి చెప్పెదాన మా
యిమ్మున కావలన్ గల మృగేక్షణ నాథుఁడు శయ్య నుండఁగా
నమ్మక చెల్ల! యింకొకని నచ్చట నే రతిఁ దేల్చె నిద్ర నోఁ
డమ్మహితుండు దీపమును నా యది కాంతల కెంత లిప్పనుల్. 47

చ. ఒక వెలచాన లేయనుచు నూహ యొనర్పకు స్త్రీలజాతికే
సుకరము మాయ యందు వెలసుందర లిందుల కై జనించుటన్
బ్రకటన కెక్కనేని యును బాధయు నంతగ లేమిఁ జేతురి
ట్టి కుటిల కృత్యముల్, విటు నటింపఁగఁ జేతురు కీలుబొమ్మగన్. 48

ఉ. నావుకు నాతఁ డిట్టులను నాతిరో! పిన్నటి నాఁటనుండి మీ
రో వెలఁదుల్ పొనర్చు పలురోఁతలు నేను నెఱుంగువాఁడ నీ
వేవిధి బోధ చేసెదవొ యేర్పడఁ జెప్పుము దివ్య మానసం
బావల, నద్ది యెట్టిదియునైనఁ బొనర్చెద శంకఁ దక్కుచున్. 49

క. అన జలజాక్షియు మనమునఁ, దన కోరిక సెల్లునని ముదం బందుచు నే
ర్పున నిట్టులనియె దానిగ, సన నేమిటు నవ్విధాత సలిపెన్ బళిరే! 50

చ. అరసితిఁ గాదె! నీ వలయుదారుని, నాతఁడు మేటి సంపదన్
ధరణిపు నంతవాఁడట యుదారత నామమె చెప్పుచుండ నొం
డొరులు వచింప నేల! యతఁ డొక్కక నాఁ డొకనాతి యింటికే
గి రహిని గానమున్ వినెనికి లది నీవు నెఱుంగ కుందువే. 51

తే. గీ. ఇప్పటికి దేని యందు నపేక్ష లేక కాని, మదిలగింపమి నిక్కువం బదియు నొక్క
నిముసమున నేను లోఁగొందు నీకు నాకుఁ, దగినదియ్యమ్ము నాఙ్జింతు దానఁ జేసి 52

క. కావున నాతని తోఁ జన, వేంధమునకైనఁ జేసి యిరువ్యేడ కతనిన్
రావింపుము తక్కనపని, నీ వేమియుఁ జేయవలదు నేన యెఱుఁగుదున్. 53

ఆ. వె. అతని తగలు గాంచి యా మీఁద నీమిఁది, పేర్మి పడతు నంచు భీతి నీకు
లేశమైన వలదు, లేఁబ్రాయమునఁ దగు, లొక్కన్నవాని విడచు గోల గలదె.

చ. అటఁ డొకవేళ నన్నుఁ దనయంతిపురమ్మున నుండఁజేసి భృ
త్యతతులఁ గాపువెట్టినను దప్పక నాదగు నేర్పుకల్మి నీ
కుతుకము నెట్టులేని సమకూర్చెద వేయును నేల? వాని "నా
ప్పతి" యనిపించెదన్ వలపుఁ బెంచి క్రమమ్మగ నీకురాఁకయున్ 55

క. అనవుడు నాతఁడు తనదువ్వదన మింపకఁ జేసికొనియును ధన మీలేమిన్
దన కది యీగతికిన్ దక్కినఁ దక్కు దటంచు నెంచి కీలెఱిఁగి యొగిన్. 56

ఆ. వె. అది యకృత్యమగుట నాత్మ నెఱింగియు, దానివలనఁ గలుగుతగులుత్రిప్పు
కొనఁగలేక "వల్లె" యని యొప్పుకొనియె నెవ్వరికిఁ దుచ్ఛవిటులు పాలుపడరు? 57

తే. గీ. రాణి నోరఁ గూర్చె మున్న భళ్ళాణనృపతి
తనసతికిఁ దాన దూతయై చనియె నలుఁడు
పరఁ గవయఁ బొందఁడె దే నాజ్ఞ భార్య, కంత
కన్న ఘనుఁడనె? యిది భార్య గాదు నాకు. 58

క. అని మనము సమాధానంబును బొందఁగఁ జేసికొని సుముఖుఁడై కొలమె
ల్లనఁ, జని యొకదినమున నిట్లనియె సుదారఁ గని మైత్రియుతగుణకతనన్. 59

మ. తమ రీయూరికి వచ్చు కార్యమది సాంతం బాయెనే? యేశే
షము లీప త్తనయందుఁ గాంచితిరి? వాస మ్మిచ్చుటన్ మీకు సౌ
ఖ్యముగా నున్నదియే? యిటన్ దమరు నింకన్ గొన్నినా ళ్లుందురే?
తమ రేగన్ మనుబోఁట్రిమిత్రులకుఁ జింతల్ సెప్పఁగా శక్యమే. 60

శా. గానమ్మున్ వినుచుంటి రొంగద! సమగ్రప్రజ్ఞ యాద్దాన నే
మీనాక్షీమణి కొప్పు! నాట్యమున నేమీ? యన్యముం జేమి? యే
యేనాళీకముఖుల్ నటింపఁ దగువా రీవీట? మీవీటిలో
నీనాట్యాభినయాదికమ్ములకు పోయిన్ జెందువా రుందురే? 61

చ. అనవుడు గానమందుఁ గల రంగన యయ్యెడ నెంద కొందఱో
యనుకృతికైన లే దభినయమ్మన నొక్కతె మాపురమ్మునం
దున, వన నేల? దేశమది దుర్గతిభాజన మొక్కదీనికే
వినికిరొకాని యయ్యెడ నివేకిని గన్పడ దందు నెందునన్. 62

ఉ. చామనచాయయుఙ్ మిగులఁ జక్కని చన్గవ లేడిమోపు ల
క్కామనికైనఙ్ వికృతి గల్పఁజేసెడి సోయగమ్ము లీ
లామధురోక్తిచాతురి కలాకలనమ్ము బెడంగుఁ బ్రాయముఙ్
మోమునొయారముఙ్ భువనమోహనమై తగు నవ్వెలందికిఙ్. 73

తే. గీ. పేరు జలజాక్షి యది నేతిబీఱకాయ, గాను జలజమ్ములను దెచ్చి కమలసూతి
తాపసము సేయుఁ శిల్పవిధమ్ము దోఁప, నతికె మోమునననుటొక్క యక్క జంబె. 74

గీ. అనుదారుంపుపల్కు "నీ యతుగను లె,యున్న నేర్వ యవియు నక్కన్నెకడకు
మనముపోవచ్చునో? యెనికునుఁ డెవఁడును, పెట్టికొనియుండఁడో? వానికట్టులేదొ"

చ. అన నతఁ డిట్లు పల్కు "నది యాకొలమందునఁ బుట్టఁ దగ్గ జ
వ్వని యని యెంచఁబోకుఁడు ధ్రువమ్ముగఁ బూవుగుత్తిఁ బోని చం
దనలతయుఙ్ గలంజప్రవనమ్మున నొతులసీమతల్లి, దా
నినడతచందముఙ్ వినుతు నిక్కము మీమన మక్కజంపడఙ్. 76

ఉ. కన్నెతిక మ్ముకానొకఁడు గైకొనె, వాని యదృష్ట మెట్టిదో
చెన్నఁటివాఁడు తప్ప నలచేడియ రెమ్మకో వాఁడెఱుంగఁ డా
దిన్నె యొకారి యాపయిని సీ! యని యెందులకో విరక్తి లోఁ
గొన్న దివో లెఁ గైకొనదు కోటు లొసంగెడువాఁడు వచ్చినఙ్. 78

ఉ. దానికిఁ బ్రాయ మిప్పుడల దగ్గరదగ్గర నిర్వదేఁడు లే
మానిని యుండదు నిట్టిక్రియ మానవలోకమునందుఁ? దన్మనం
బేనరనాథసూనుపయి నేర్పడియుండెనొ? యెంతకోస మీ
వ్రానము తాల్చెనో? యొసలమానస మెగతిఁ గానవచ్చెడిఙ్. 78

సీ. ప్రాగ్వరీతిగాఁ బద్యమ్ములను వ్రాసి "వ్రాయుమి? కా" బంపుచుఁ బంపువారు
యుత్తరమ్మును వ్రాయ కుండి యెచ్చట నైనఁ గనుపడ్డఁ "గరుణ లే" దనెడివారు
లేనిపోనిపని గల్పించుక యింటిముట్టును బడి తిరుగాడుచు నెనడివారు
అంగీకరింప లే దనెడికోపముచేత గోడను గాకితాల్ గొట్టువారు

తే. గీ. ఇంటిపై బెడ్డలనువైచి యేగువారు, గొట్టవలెనంచు లోలోన గొణుగువారు
నై రుదరు దానిపొందుఁ దామందలేక, వినిని వదలిరి యాజోలి విటులు. 79

ఉ. ఎవనికిఙ్ ధన్యునిఁ జేయనున్న దియొ? తానివ్వాని తారుణ్యముఙ్
గవివర్ణ్యం బొనరింపనున్నదియొ? యే కాంతాశిరోరత్నముఙ్

పవిత్రాత్మై యుడికింపనున్నదియో! యేసాటజ్ఞు సంసారసా
రవిహీనత్వము వాప నున్నదియో? నేరం బోల దూహింపఁగన్. 80

క. అనవుడుఁ "దాదృశగుణగణ, ఘనుఁ గనుఁగొనుటయును గొంత గణనీయము నీ
వెనువెంట నెప్పుడేనియుఁ, జనుదెంచెదఁ దెల్పు తగిన సమయ" మ్మనుడున్. 81

క. "కనుఁగొని తెల్పెద" నని యా, జవరాచపుఁ దరిగె దానిచక్కఁదనము నె
మ్మనమున నాటుకతన నా,తనమాంద్య మ్మయ్యె నాఁడవరి కరుదెంచెన్. 82

క. దానియిలు సేరిన ట్లు,ద్దానిన్ గనుఁగొనినయట్లు దానిచతురతన్
దా నోడినట్లు మనమున, దానింగను దాని నెంచు దానినుతించున్. 83

తే. గీ. మునుపువినినప్పుడే కొంత మొలకగనిన, వానియనురాగవృక్ష మివ్వాలికతన
నిపుడు తిరిగియు వింటచే నెదిగి వింత, సరణి నొక్కింత శాఖోపశాఖలలరె. 84

క. అట్టియెడ నింతకుమున్న జలజాక్షిఁ గుఱించి ప్రశంసించినవాచపున కొక్కింత శత్రు
వగు మతియొక్క విటుం డిట్లను. 85

తే. గీ ఎవనితో నెన్నఁడేనిఁ దన్నిం మకంత, యనుగమున్న ప్రేమం దిరయేయగును గాక
చెట్టయగుఁ గాక తనయంతఁ జెప్పఁ దొడఁగుఁ, వానికన్నను బేల యొండైనఁ గలఁడె?

క. అయినను మీ శ్రేయస్సు ప్ర, ధానముగాఁ గోర మీదుతలఁ బెక్కంగా
నా నేర్చినంతలో మీ, కేనొకసంగతిని జెప్ప నెంచితని జూఁడీ. 87

క. ఏటవ ర్తనలోఁ జిన్న, ప్పటినుండియుఁ దిరిగి దానఁ బడుపాటుల నొ
క్కటియుము దక్కక యెఱిఁగి, పటుమతి నని సన్నెఱుంగవలయును మీరల్.

క. విధవల నేకులు గల, "రా, విధవలలో మొట్టమొదట విధవ యెవఁడు" నా
నధమపు వేశ్యలఁ గూడెడి, విధవయె! నాయనుభవమున విని చెడఁ జూడీ. 89

క. పేరిమ మొకించుక లేకయె, కామము గలవనిత వలెనె కామునకై తా
నోము సుతునైనఁ గూడెడి, సామాన్యం గూడు వానిజన్మము ఘనమే? 90

తే. గీ. ఇహపరమ్ముల నెఱుఁగని హీనమతులు, కష్టసుఖముల నెఱుఁగని కఠినమతులు
మానమర్యాద లెఱుఁగనిమందమతులు, తక్కువెలవెలఁదులపొందు దలఁపరెందు.

ఉ. దండుగ ద్రోహమై సకలధర్మములన్ విడనాడి బోగపుల్
ముండలతోడఁ బోవుటకు బుద్ధిని ప్రేరణ చేయుచున్న యా
గండలకొద్దు దానికి సరాసరిగా ధన మీయకున్న బ్రి
హ్మాండము మ్రగ్గిపోయినటు లాపయి నేడ్చుగు సర్వహీనులై.

ఆ. వె. ఉండఁ గొంపలేక, పండఁ బానుపులేక, యొండకిచ్చుటకును మునుపు లేక
మొండితనము పూని దండివార మటంచు, బండవిటులు దిరుగుచుండఁ గనమె.

శా: వేసాలన్ పచరించినన్ మనము తృప్తిం జెందఁగాఁ బోదు వ్య
త్యాసమ్ముల్ ప్రబలించు బుద్ధి చెడు నాయాసమ్ము మెండౌను వి
శ్వాసమ్మున్ జెడిపోవుఁ గోప మొదవున్ వాంఛల్ తుదల్ముట్ట వీ
స్త్రీసాంగత్యముకన్నఁ బాడుపని వేఱేలేదు చర్చింపఁగన్. 94

శా. వైకుంఠమ్మయి శంభులోక మయి దేవజ్యేష్ఠునావాస మై
నాకంబై నరలోకమై నరకమై నానాఁటికిం దోఁచు నీ
రాకాచంద్రముఖీసమాగమమునన్ బ్రాజ్ఞేతరుల్ వారె సు
శ్లోకుల్ పండితులున్ భ్రమింతు రిది యొక్కొ ప్రాయ మూహింపఁగన్. 95

తే. గీ. మొదలసంసారమే కడు మోహమయము, గాన దానికె యొప్పరఖండమతులు
దానిలో లంజెవలని యిందైనసుఖము, చెప్పనా? శత్రునకును నీచేటు వలదు.

క. తలిదండ్రులు మోదింతురొ! కులమున బ్రతిష్ఠగలదొ? కులకామిని. లో
నలమట గాంచదొ? యేమిటఁ, గలుగున్ సౌఖ్యమ్ము లంజెకాఁపురమందున్!

క. తనువు చెడు మానమడఁగున్, ధనముడుగున్ శుచిఁ దనకు దవ్వగుఁ బౌన
మ్మును నబ్బు జాద మెనయున్, ధనకాంతలు నేర్పునట్టి తప్పులు గలవే? 99

క. "మనతలన పుట్టెనే? యిప్పుడు" లని యొకవేళ మీరు ప్రశ్నింతురు, కై
కొనవలె నటులేనియుఁ దాఁ, దనకన్నన్ జిన్నదానిఁ దగియెడి దానిన్.

క. "వచ్చియు రానివచనములును, వచ్చియురానట్టి ముద్దు బాలురపలుకుల్
హెచ్చగు మోదమునిచ్చును" నచ్చును రసికులకు నదియె నవనవగరిమన్.

క. ఒఱగినచనుఁగవ గలిగిన, తరుణింగవగూడుకన్నఁ దఱచై కడుఁ గ్రి
క్కిఱిసినచనుఁగవ గలిగిన, తరుణులపదతాడనము శతగుణము మెఱుఁగౌ.

ఉ. గిల్లినఁ బాలుగాఱు కలికిన్ గరఁగూడిన సౌఖ్య మబ్బఁ గా
కెల్లిటు ప్రౌఢ్యులును నెత్తరతిత్తర చేసినట్టి యా
యల్లరిబోటిఁ గూడ సుఖ మబ్బునె? మాటలతేట దక్క నీ
యుల్లమునందుఁ జూచికొనుఁ డూరకవాఁగెడివాఁడఁ గాఁడుఁడీ. 102

ఉ. "పున్నమ నాఁటి చందురునిపోడిమి మంచిది గా" దటంచు నే
నెన్నఁడు గాని పల్క నిఁక నేమన? నద్ది క్రమక్రమమ్ముగా

సన్నగిలున్, ద్వితీయ నవచంద్రుఁ డన్నఁ! గ్రమక్రమమ్ముగా
నున్నతి చెందు శ్రేష్ఠ మిదియొక్కటి ప్రోదవమున్న దోషఘన్. 108

తే. గీ. అందులో మీఁద తద్దానిపొందు సేయ, నెంచు మంత్రిరో యదియు మీకీడుగాదు
దానికుపకార మొనరించుతలఁపుఁగలిగి, వాఁడటులు సెప్పె నేనాఁటివనిత యదియు.

తే. గీ. ఇపుడుమీతోడఁ జెప్పిన యీప్రబుద్ధుఁ, డెంమి నివ్వెన్నెలాఁడికి వలపుమగఁడు
పేరుగుఱ్ఱచ్చెంగనేల? యీయూరి దీనిఁ, జూడమున్నట్టివార లెవ్వోటు లేరు.

క. ధనవాంఛ లేకయే యువ్వనితామణి యీసు వమ్ముచాలికే విటులన్
గని పిల్చి కూడఁజొచ్చెను, దన కోలమున కన్నెల్లఁ దను నవ్వంగన్.

ఆ. వె. "మాఱుమనువు దానిఁ జేరంగఁదీసిన, మొనటి మగని సోదె మొనలు పెట్టె"
నన్నరీతి నిది రసాభాస, మందును, నెక్కుడగును మీర లెఱుఁగవలయు.

క. చాతుర్మాస్యలలో యతు, లేతీరున బోంకెదరో యదే తీరున నే
శ్యాతరుణులు వయసు గడుగ్, ద్రాఁతురు; తలక్రిందు చూడఁ దగు నటు నిచటన్.

ఆ. వె. తనకుఁ బెద్దయైనతరుణితోఁ గూడుచు, యూయము వణఁగఁ జేయు టట్టులుండ
"దాని కేటిపీనితగు! లేదకే?" దంచు, నగుదు రెల్లవారు నగడు చేసి.

తే. గీ. కడఁగి "కడవంత గుమ్మడికాయ కత్తి, పీటకగు లోఁదు"వనియట్టి బోటి నొప్పు
టొప్పినంబేనియును దీని నొప్పబోదు, డింతకన్నను జపలురా లెందు లేదు.

క. అన నతఁడిట్లను "నేమను,లును గఱవే?" చెప్పవచ్చు లోఁబడియొడి య
జ్జనులు దొరకగ వేశ్యా, జనులకుఁ గలదోసఁగు లితరజనులకు లేవే? 111

తే. గీ. దేనియందైన ననుభూతి దీఱువిదప, దాని నిరసించువాఁడెంత జ్ఞానిగాఁడు
మొట్టమొదటను నిరసించు నట్టివాని, నెన్నఁగాఁదగు వారలు నున్న జగతి.

క. అనిపలుక నాతఁ డంతటఁ, జనిరెమ్ము దారుఁ డిటులోఁనఁ జర్చించె "నొకం
డను మోదించినవస్తువు, జనుఁ డింకొకఁ డొప్పఁడిదియు సహజం బెందున్." 113

క. చందురుకాంతిం గని లో, నందఱు సంతోష మందరే? రెయ్యేడలను దా
మందురె? పంకజములు, జగమందఱికిన్ ముదమొసంగునది లేదెందున్.

ఉ. దాని పవిత్రనన్ గుఱించి తద్దయు నాతఁడు నచ్చఁ జెప్పిన
న్వేదరునైన నయ్యతివ యేలికొనన్ గమకింప దన్నమా
టే నిజ, మక్కతమ్మునన యీశని శాతరుణీవశంసమం
దూనెనూయు, నిక్కమది రొక్కఁడు నెప్పడిబుద్ధు లొప్పనే? 115

ఆ. వె. దాని వినినదాది తన్మయుఁబయి చిత్తవృత్తి విస్మృతాన్యవృత్త మయ్యెఁ
గనిన యప్పు డేమిగ నున్నదో, బుద్ధి కర్మ మనుసరించుఁగాదె! యెందు. 116

సీ. కాంతలతోఁ బొందఁగా రామి సిక్కమా! యటులైన నేల పెండ్లాడవలయు?
అన్యకాంతలఁ గూడు టనుచితం బందుమా! యటులైన నిది యుఁగా దన్యకాంత
వెలయాండ్రిచెల్మి తప్పిదమౌనటందుమా! యటులైన వెండ్రెంగు కవనియందు?
సత్కులీనులకు నాచారంబు గా దందుమా! యింతలోన నేమాఁ గులమ్ము?

తే. గీ. కలియుగమ్మున నీరీతి కట్టుఁబాటు, గాని మున్ను శకుంతల గాదె? వేశ్య
యాపెఁ గొన్న దుష్యంతున కందునింద, నేమి లోపమ్ము గల్గె? నిందేటికింక!

చ. పలుపుర నొక్కచేడియకుఁ బొల్పడు టొప్పదుగాని సేమముల్
వెలసెడి యిట్టియుగ్మలిని వీధి మొగమ్ము గనంగ నీక తాఁ
గులసతిఁబోలె నుంచుకొనఁ గూడదె? దీన మతేమిలోపమా?
గలిమికి నెందునుల్ ఫలము గాదె? మహోన్నత భోగభాగ్యముల్. 118

ఉ. భోగమునందు నిచ్చలును బొందని వారిల లేరు దానికిన్
ద్యాగము ముఖ్య, మందులకు ద్రవ్యము గావలె దానిలేమి న
య్యాగమవేత్త లీసుఖము నందఁగలేక స్వరీతి నెల్లెడన్
భోగవిహీనులన్ సలుపఁ బొత్తము లీక్రియ వ్రాసి రీసునన్. 119

క. ఒకని ధనమాటుచేఁ బర, వికచాఁ భోజాక్షి నెనయువిధ మది దోసం
బీఁక సకలజనులకును దా, నొకగతి ధనమగుట వేశ్య నొందందగదే. 120

క. ధననాశనతక్షణ నాశన, ఘనతా నాశనము లిందుఁ గలుగుట ధ్రువమై
నను నెల్లగకును నయ్యావి, పనుపడు ననరాదు భాగ్యవశమగుకతనన్. 121

తే. గీ. ఎందు వేనియు సందియ మెన యుకుండ, మనుజుఁడు ప్రవర్తనమ్మును గొనఁగవలయు
గాని దీర్ఘయోజన కొఱగాదు "సంశ, యాత్మ వశియించు" నని పెద్ద లండ్రుగాదె.

ఉ. సారవిహీన మైనభవసాగరమందుఁ గురంగలోచనల్
సారము, తెల్విచేటలను జాణతనమ్మును నందుముఖ్య మీ
తీరు స్వతంత్రులైన సుదతీమణులందుఁ బొసంగు, వాం ఛ్రిపహో
హారిణులంచు మానుకొనఁ జాతురి యింతకుఁ జూడఁ గల్గెడిన్. 122

ఆ. వె దోసఁగులెన్నియేని బొసఁగుఁగాకెందును, గలలఁ గానవిద్య కన్న లేదు
అంగనాజనమ్మునందు రూపాజీవ, కన్న మనము దనుపుకన్న మున్న.

# పాణిగృహీత.

## తృతీయాశ్వాసము.




సరసతర, రుచిరగీత,
స్వరసాదర లక్ష్మణాగ్రజన్మగృహీతా
గురుతర భాగ్యసమేతా,
చిరకీర్తిప్రాప్తిధామ సీతారామా.

తే. గీ. అవధరింపు మనంతరం బాలతాంగి, యెప్పుడుసుగనుమాయకయెసక మెసఁగు
తనదు దేహమ్ము గేహమ్ముఁ దదధికముగ, సొంపుగులుకనలంకృతుల్ చొనిపిపిప. 2

క. ఉత్తమపాత్రమ్ముల న, త్యుత్తమగతినలవరించి యొక్కెడ దరా
యత్తమ్ముకుచిత్రమ్మగ, నత్తరుణి గవాక్షనిహిత మగుచూ పొలయన్. 3

తే. గీ. ఎదురుచూచుచు నున్నంత నిరువురచటి, కేగి రేగుటయును దరుణేందువదన
దవ్వులనఁ గాంచి కేళీసదనములోని, కంతలోఁ జనె సిగ్గున్నయబల వోలె. 4

తే. గీ. ఆ దుర్వారుని నొక యుచితాసనమున, నుండఁగాఁజేసి నర్మసఖుండు లోని
కరిగి "యిదియేమిపాప మోయబల! యతని, దీసికొనివచ్చినప్పు డీకీడు తగునె?" 5

వ. అన నాటక్కరి కరిగమన యతని కిట్లను.

ఉ. దూరమునందు నున్న యెడఁ దోయజనేత్రల కెంతయేని వా
గ్ధోరణి యుప్పతిల్లు మదిఁ గొంకొకయింతకయున్ జనింప దా
ధీరతయున్ గభీరతయుఁ దెంపును బెంపు నడంగ నైన యా
పూరుషు మోము గన్గొనినఁ బోవు నదెంతటి ప్రోడకేనియున్. 6

క. నమ్మెదవో లేదో యాతని, నెమ్మొగముం గనినయంత నే మదిలో నా
యుక్కమ్మడిగ లజ్జ వొడమెన్, జిమ్మన నది వదలిచనను చేవదగులుటన్. 7

క. వనితనమునుండి నన్నున్, గుసుమశరవిహారములఁ దగుల్కొల్పవనీ
దు సమీపమ్మున నితనిని, దెస మొగమెటు త్రిప్పి నిలువఁ దేఁకువగలుగున్. 8

క. పలువురప్రియురాండ్రొక్కటు, గలసభఁ బురుషుండు నిలువఁగలఁ డధిరసమున్
దొలఁగింపదు కామినులటు, నిలుచుటయున్ దగదు రసము నీరసము నగున్. 9

వ. అను నక్కలికి పరిసంగమ్మునకద్దుగా నతం డిట్లను.

క. అతఁ డచట నే నిచట నుం, ట తగదు నే నెఱుఁగనట్టి టక్కరితనమా?
యాతివ! యిది, సిగ్గు మీ జాతి తరుణులకు నున్న యంత తెల్లం బెన్నన్. 10

తే. గీ. అని యతండు పలుకుచుండ నత్యంతవినయ, యల్లనల్లన వాకిటనట్టియెడను
వరిగి తటుకంబ మొక్కొంతయడ్డుగాఁగ, నోరగానిల్చి కాంచుచునుండునంత.

క. తనమది నర్థాంగిఁ గనుఁ, గొను టెప్పుడటంచుఁ గోర్కె గుబ్బతిలఁగఁ జెం
తనసేయు నయ్యుదారుఁడు, వనితవెడంగంతఁ గాంచి వహ్వారె! యనుచున్. 12

తే. గీ. మెచ్చి "యిచ్చపలాక్షి నా మేడనుంచ, నేర్చితివమోఘ నాపు వన్నెయును వాసి
కలుగు జన్మన మిది సార్థకత్వమందుఁ, గలిమిగలుగుటకును సుంతగలుగు ఫలము. 13

క. తగు కాంతతోడఁ బొందుట, దగులని మనువజుకునైన ధనధాన్యమ్ముల్
సొగసును జాణతనమ్మును, భవద్వ్యంచితము లధికపాపాస్పదముల్. 14

ఉ. ఈతరుణీమణిన్ గలసి యించుక భేదము లేక యుండఁ దా
నేతరుణుండు కాముకల లెప్పుడు చింతనసేయుచున్ లస
ద్రీతవినోదముల్ గనుచుఁ గేళల మోదమయాత్ముఁడై వసు
స్స్థితికి సార్థకత్వ మొదవించునొ వాఁడుగదా! కృతార్థుఁడౌ." 15

క. అని యూహసేయు వానిన్, జనరాలోకన మొనర్చి మురియు మఱియు న
వ్వనిత కిలపాటి లేదని తనలో, నానందమందుఁ దనియు నెడందన్. 16

తే. గీ. అట్టియెడ నర్మసఖుఁ డిట్టు లను "జగాన, నభినయమ్మున నీపాటి యుండరతె
గానఁగా రాదు గానమ్ముఁ గవనశక్తి, దానికిన్ దోడు దీని కేతరుణి లేదు?

క. ఎదుటన్ జెప్పిన నతియుని, మది నమ్మదనతికిఁ దోఁచు మాటలిఁకేలా!
గుదిగూర్చె నన్నిసంగతు, లిది తావుగ నెంచి ధాత యింపెసలారన్. 18

క. అని జలజాక్షిం గనుఁగొని "వనబోణిరో! సిగ్గు వారవానికిఁ దగునే!
కనుఁగొన వచ్చినవారల, మనమెక్కన్ మెలఁగవుఁట మరియాదటవే! 19

క. సిగ్గుగల వారకాంతయు సి, గ్గెఱుఁగు కులాంగనయును జెఱుదురు నీవీ
యొగ్గెఱుఁగ నేర విది యొక, పెగ్గ యనుచు గునిసె దింపుఁ జెంపుగలుగునే. 20

తే. "సగముచచ్చి యంతయుఁ జచ్చి జగతి గాన, హాస్యములు నేర్చికొనవలె" నందు రందు
నభినయమ్మునకట్టిద యదియుఁగల్గి, యింతసిగ్గునడఁ జనునె? రోయి గుఱుబోణి. 21

క. నీ తెలివితేటలకు సం, గీతాభినయప్రసక్తికిన్ గైతకుఁ బ్రి
ఖ్యాతిఁ జెడఁగొట్టెఁగద! లో, కాతీతంబైన లజ్జ యలవడి యబలా. 22

క. అనుమాటకుఁ బ్రత్యుత్తర, మును జెప్పక యంతకన్న మొగ మించుక వం
చి నగుచు నా జలజాక్షి య, భినయమునఁ బాండిత్యమెల్ల వెల్లడి చేసెన్. 23

తే. గీ. తెచ్చి పెట్టిన సిగ్గయ్యె ధీర యగుట, సహజవైఖరిఁ గనఁజేసి చలదపాంగ
వీక్షణమ్ముల నొక్కింత వెల్లిగొలుప, నిందుముఖ తెక్కి యయ్యుదారుఁడు పలుకు. 24

తే. గీ. ఏటికిద్దాని నీవలయించె? డింక, నీవు చెప్పిన దంతయు నిక్కమయ్యె
"వటులులం జెలలోఁ బతివ్రత కులాంగ, నాజనమ్ముల లంజెయు" నాఁగవినమె. 25

తే. గీ. నీవు చెప్పినయట్లన యీ వెలంది, యేదియో కారణమ్మున నిక్కాలమునఁ
బోడమెఁగాఁబోలు వయసునఁ బ్రోడయయ్యు, నింతబిడియమిక్కాలమున నెందుఁగలదె.

తే. గీ అభినయమ్మది చూచినయట్టులయ్యె, గాన మీరీతి చక్కని కాంతి గలుగు
పలువరుస గలకలుకుల కొలయుటుసదె! కవన మీరెంటికన్నను గష్ట మగునె? 27

క. అను నాతనిపలుకులు విని, తనపై నవ్వానిమనము తగులుట నిక్కం
బని యెంచి యంతలోఁ దీఱని చింత వహించి యిటు కరమునూహించెన్. 23

ఉ. చక్కనివాఁడు మేటి సరసమ్మగువర్తన మొప్పువాఁడు బల్
టక్కరి గానముఖ్యకలలన్ గడునేర్పరి ద్రవ్యవంతుఁ డ
మ్మక్క! యితండు నాకుఁ బ్రియుఁడౌట పురాకృతపుణ్య, మైనన్
జిక్కిన పూర్వపుంబ్రియుని స్నేహము నేగతి మాననేర్చెదన్. 29

క. ఇతనిన్ గాంచిన దాదిగ, మతి నీరై యంతు లేనిమరులున కొఱయై
సత మైనచింతఁబడి వి, స్మృతసకలం బయ్యె ముందు మేఁగుట యెట్లో. 80

చ. ఇతని వరించి యెల్లపు డహీనసుఖమ్ముల నందుచున్ రహో
స్థితి కధికార మూనినమనమ్మునఁ దన్ దలపెట్టనేని నన్
మతిఁదలపోసియున్ విసివి మాటికి దూఱియుఁ ద్రోవగాన క
చ్చతురుఁడు కాయమున్ విడి యశ మ్మెట్టువంటిది నాకుఁ గూర్చునో. 81

మ. ఎప్పుడో యే మగనో యటంచు మదిలో నెంచంగ నేలా! యితం
డిపుడే తా మొగ మింత చేసికొని యేదేఁ బెద్దయాపత్తు నె
త్తిపయిన్ వ్రాలినయట్లు చింతగొనుచున్ ధీరత్వముం బూనుటన్
గపటానందము పైకిఁ జొప్పడఁగ నన్ గన్పట్టుచున్నాఁడహో. 82

సీ. ఏకర్మమెఱుఁగని యెలబ్రాయమున నేను కసరికొట్టి నొకింతవిసువఁడయ్యె
నెఱిఁగియు నెఱుఁగని చిఱుతగుబ్బలఁ జట్టి పరుసదనానకు వెఱువఁడయ్యె
నెట్టకేలకు నాదుగుట్టు చేకొని వృద్ధ యాఁడిపోసినదాని కలుగఁడయ్యె
నాకారణమునఁ దనకుటుంబమునఁ గల్గుకలహమ్ములకు భీతి గాంచఁడయ్యె

గీ. వన్నిటికి నోర్చి నను బ్రియురాలొ లేక. దైవమో యనుబుద్ధి నెవండలంచు
చున్నవాని వృథా ద్రోహ్యమన్న కార, ణమున విడనాడు నాకు జన్మమునుగలదె

గీ. దౌత్యమంగీకరించె నాతనిఁగరంచె, నంతఁబోక కిమ్మ్యాడఁదెచ్చెఁ జింతగలిగి
యును మదుపకారమునకు దానినెడఁజేసి, యీనుదిగమ్రింగ నింతవిశ్వాసిగలఁడె!

చ. ఇటుపయి నీతనిన్ మఱవకే యొకభంగిని గారవించి యు
క్కటికను చూపి నీను గలకాలము సౌఖ్యము నందఁజేసినన్
గటకట! తానెవన్ మఱమఁగాక యిదెల్లను గామియాట, నా
కెటు మఱవంగవచ్చు నిది యెన్నిభవమ్ములకైనఁ జాలడే. 35

చ. "తనప్రియుఁడైనవాఁడఁ టొకతప్పును నాతనియందు లేదఁ టే
పనియు నొనర్చువాఁడఁట! సెబాసు! ధనమ్మున నాస చెంది య
య్యనఘుని నీచకృత్యమున కాస్పదుఁ గా నొనరించె నొక్క రో
వనిత" యటన్న దుర్యశమువాయుఁగ నాకు నుపాయ మున్నదే. 36

తే. గీ "పెండిలివి నాడకుండిన నుండెఁగాని, వారకామినియైనను వరు నొకాని
కని వరించి తదనుగతి గా మెలంగ,వలయు" ననుకట్టుఁబా టుండవలదె! జగతి.

ఉ. మా లెతకన్న హీన లగుమానవతుల్ వ్యభిచారవృత్తికిన్
జాలక కట్టుఁబాటునకు జుకుచు నొక్కనిన్ వరించుచున్
గాలముపుచ్చుచుండ, గణికాజనమంతకు నెంతహీనమో
కూళతనమ్మునన్ బసుచుకొంటకు రోయ దొకించుకేనియున్. 38

తే గీ. ఒకఁడుపోయినమీఁద వేఱొకనిఁ గట్టి, కొంట మాచార మొకకొన్నికాలములం
దు నందులోనను జేర దీయధమములను, ధాత వంచించె నీజాతి తలిరుఁబోండ్ల.

క అనితవమనమునఁ జింతిలు, వనితామణి సారెసారె, వార లిరువురున్
దనతన కనుగుణ మగు రీ, తిఁ జింతం గాంతు రదియుఁ దెలుపఁజాలమే! 40

గీ. మగువ నీగతి నొందెడు రెమ్మెగముగనుచు, నెడతెగని చింతయను సంద్రమీఁదుచుండఁ
దరణి యంతటి వారికిఁ దగనిదగుట, హో! యనఁగఁ బశ్చిమాంబుధిఁ డాయఁజనియె.

క. అంత నుదారుం డచ్చెలి, చెంత న్నిలుపోపలేక చేతోజాత
శ్రాంతికి వశుఁడై చనియెడి, చింతన్ లేమటయును నతని చెలికాఁ డనియెన్. 42

ఉ. గానము వింటిమో కవనకౌశలమున్ గిలకించినారమో
మానమునందుఁ గల్గు ననమానపుఁజాతురి దక్కఁ బంకజా
తాసన యించుకే నభినయంపుఁ బ్రసక్తియుఁ జూపదయ్యె మీ
రీ నలినాక్షిపై నలిగి యిక్కరణిన్ జను టెట్టు లొప్పగున్. 43

ఉ. నావుడు నాతఁ డిట్టులను "నాదు మనమ్మునఁ గోప మంచు నీ
వేవగ నిశ్చయించి? తది యెక్కడిచాతురి? యింతమాత్రనే
యావగలాఁడి నమ్మనె? సఖా! యొకవిద్దియుఁ గాదు దీని కే
త్రోవల నేలతాంగి సవతుం గనఁజాలు! నెఱాను! వహ్వారే! 44

క. కనుఁగొనినమాత్రనే మన, మున మోదం బుప్పతిల్లె ముమ్మాటికి ని
క్కానఁ గాంగి కింకరియమి, చ్చిన దానం జేసి మనసుఁ జేటగుఁ జుమ్మీ. 45

చ. ఇది యొక చిత్తలోదరికి నెవ్వరియొద్దను పద్దె చూపునీ
చదరెఁ దొలంగఁజేయ మరుచాపుఁడు యత్నమొనర్చెఁగాక యి
చ్చ్మకవతి సిగ్గునం దిటులు మ్రగ్గుమనుంకులు చూచి యాత్మసం
పద నెఁడింపఁ జేయుచెలిపట్టున నాతఁ డనుగ్రహింపఁడే.  46

తే. గీ. మరలరాకచ్చెఁగవచ్చెఁద్వరయదేల?, యబలయేమగు? మనమేడకరుగువార?
మభినయంబెందుఁజొచ్చె? నెందడఁగుగాన?, మకట! యారంభశూరతజగతి నెంచు.

క. నావుడు నర్మసఖుం డవ, ర్వాపురిఁ బోఁడిఁగని పల్కెఁ "బోలఁతిరో? నీపైఁ
గావలసినంతకోరిక, చే వచ్చినవారి నిట్లు సేయం దగునే? 48

క. సుమగాత్రి! వారి మంచిత, నమున న్నీలోటు దాఁగనం బడదయ్యెన్
దమలపుటాకులకున్ నో, చమె? యెఱుఁగవె? యిదియు సాంచందమ్మగునే?

మ. అన నచ్చేడియ భూషణధ్వనుల పాల్పవ్వారిగా నల్లఁ గ్ర
క్కునఁ గేళీభవనమ్ము చెంతఁ జని యాకుల్ప్రోఁకలుఁ దక్కఁ గ

ల్గిన మేల్వస్తువులుగూర్చి పళ్లెరమునఁ గీల్కొల్పి యొయ్యారమొ
ల్లను రూపై చనుదెంచెనో! యనఁగ మెల్లన వచ్చి యచ్చెరువునన్. 50

గీ. వినయభయసంభ్రమమ్ములు వెల్లిగొనఁగ, నిలువఁబడునంత నద్దాని నీటుకొంత
యడ్డులేమిని గనులార నతఁడు గాంచి, నిలువునీరయి యట్లన నిలుచఁబడియె. 51

తే. గీ. అంతనచ్చెలి మిన్నకరాగ్రకిలి, తమ్ములకు నాగవల్లీదళమ్ము లతని
హస్తమున నంది పళ్లెర మచట డించి, చని యథాస్థానమున నిల్చెఁ జవులుగులుక.

ఉ. అంత సుదారుఁ డొక్కగతి నచ్చొటు వీడి తదేకచిత్తుఁడై
యింతివిలాసముల్ మగువయొమ్మెలు పైదలి మేల్ హొరంగులున్
గాంతయొయారముల్ కనులఁ గట్టినయట్లెనటు స్మరింప న
క్కాంతుఁడు లేనిమేళ్ మటఁ గల్పనసేయఁగఁ జూచుచున్ జనెన్. 53

ఆ. వె చనుచు నర్మసఖునిగని యిట్లుపల్కె "నో, చెలిమికాఁడ! జగతిఁ గలుగుపట్టు
ణముల మాపురమ్మునంగల చోద్యముల్, గానరావు వేరొకంట నెందు. 54

చ. అటఁ గులకామినుల్ పడపుటంగనలున్ మతివేనవేలు మి
క్కుటమగురూపమున్ ప్రాయలు కొల్లలుగాఁ గలవారలుండ్రి నా
కెటు నిటువంటి చానఁ గను టెన్నఁడునున్ లభియింపదయ్యె ని
చ్చటు భవదీయసంగతివశమ్మున నింతటి భాగ్య మబ్బెఁగా! 55

క. నాతోడ నీవు చెప్పిన, యాతరుణీమణియె యిదిసఖా? యది గాదో?
యీతీరెక్కడ? నీవను, నాతీరెక్కడ? శతాంశ మంతరమునుమీ. 56

ఉ. చూడకచూచు నేర్పు వినుచున్ వినకుండెడికౌశలమ్ము మా
టాడక యాడుజాణతన మన్నిటికేమి? యొకింత లోనఁ బో
రాడుట కమ్మనోభవు విటాళిపయిన్ బురికొల్పుపొల్పు పూఁ
బోఁడికి దేనికిన్ గలుగఁబోలను దీనికిఁ గల్గుచాడ్పునన్. 57

తే. గీ. గుబ్బలబెడంగు పిఱుఁదులగొప్పతనము, మేనితళతళలును మోముమిసమిసలును,
గలికికైనంతమాత్రిన గల్గ నిక్క, తమున మెచ్చితి నంచెదఁ దలఁతు వేమొ.

చ. పలుకులు వేయునేల? పరభామలనున్ గను తెత్తిమాఁడ నే
తెలవెలఁదుల్ సుఖమ్ముగను వీనులుచల్లఁగ నెంతపాడినన్,

గలఁగదు మానసం; బిచటు గానమటుండ మటొండటుండఁ బ
ల్కులును వినంగలే దకటు! కోరికలీరిక లెత్తనేటికిన్!

ఉ. తరము లనేక్కరోజులిగెఁ దాతల తాతలు వారితాతలున్
మఱియును వారితాతలును మాకొలమం దిటువంటి కోర్కులన్
మరగరు, దానికేమి, కడు మన్ననకెక్కిన పాండితీధురం
ధరు లటువంటివారి కిఁక నాకతనన్ ద్రిదివస్థితుల్ చెడెన్. 60

తే. గీ ఏమయినఁ దప్పదింక నీయింతి చెలిమి, యయ్యదియు నీయధీనమై యలరుకతన
నచిరకాలలభ్యంబని యాత్మనెంతు, ననుడు నతఁడిట్టులను సువారునికిఁ జేర్చి. 61

ఉ. చెప్పితఁగాదె! మురన్ రసికశేఖర! యాలలితాంగి చంద, మ
య్యొప్పును గొంత మీ కనుభవోచిత మయ్యెఁగదా! తనంత న
య్యొప్పులకుప్ప యొప్పుకొను టొక్కటిదక్క నుపాయమింపునన్
జొప్పడ దన్య, మేమయిన సుందరిడెందము చూచిచెప్పెదన్. 62

చ. ధనమన లెక్కలేదొకటు దానికి లోఁగిన వేలసంఖ్య క
చ్చ్చన, నదియేనిఁ దజ్జనని మాపునకున్ భ్రమగొల్పనేమి? య
వ్వనజముఖీలలామమును వంచనసేయఁగ నేయుపాయమున్
బనుపడ దైన యత్నమును మానఁగరా దెపుడెట్టు లుండునో! 63

చ. నినుఁ గనుఁగొన్న మాత్రమున నే వెలచేడల లెక్కయేల? యే
వనజముఖీలలామములు వాంఛ యొనర్పక మాననేర్తు? రై
నను నిటు యత్నమేల యన? నాయనుభూతినిఁ బట్టి చూడ ని
క్కనకనిభాంగి యోగిఁగఁ గాంచుపుచ్చెదునంచుఁ దోఁచెడిన్. 64

ఉ. కాని సమంజస మ్మనుచుఁ గన్పడ దిప్పటి యూహయున్ సదా
గానమునందురక్తి వెలఁగల్గు కలంకృతులందు సక్తియున్
మానశరప్రచారములఁ జొప్పడు కబ్బములన్ బ్రసక్తి య
చ్చానకు పెంపు, తద్విధము చంచలతం గనఁజేయు నిర్వ్యథన్. 65

గీ. మునిఁగిపోయినదేమి? యమ్మకుదతల్లి, తోడ మీమది నున్న సంతోస మెఱుఁగఁ
జేసి యామీఁద దానికిఁ జెప్పఁజేసి, [illegible] జెప్పిచూతు నిందేటిచింత! 66

ఉ. నావుడు నత్తుకత్వ మెసవాటు సుదారుఁడు పల్కె "నెప్పుడో
నీ విటు సేతు" నన్న నెటు నే నిలుపోపుదు? నేఁటిరేయి నా
శావగలాఁడి, యాయతివ, యా చెలి, యాచిగురాకుఁబోఁడి, యా
కావరపుం జనుంగవ బోటు పుటికల్, పళ్ళయ్యు గావలెన్. 67

క. కేపేమో మనమేమో, యాపూవు బోణియేమొ యన్యమదేమో
నే పా మ్మిప్పుడ నాసం,తాప మ్మెడఁబాపు మింకఁ దడయక యింపటన్. 68

తే. గీ. చందురుం డిద్ధముదయించెఁ జదల వెన్నె
లయును బర్వెఁగఁ జొచ్చెఁ దోలంగెఁ దమము
మందమారుత మదె చూడు కుందకులప
రీమళమ్మును వెదజల్లెఁ రేఁగె మరుఁడు. 69

ఉ. తల్లికి నేమిచెప్పెదవో? దానికి నేమని విన్నవించెదో?
పల్లవపాణి కేక్రియఁ గృపన్ గలిగించెదో? నన్నుఁ దన్మనో
వల్లభుఁ జేయు భారమది పైనిడికొమ్మెటు నీ వొనర్చినన్
జెల్లునటం చెఱుంగు మొకచేడియ వానిఁగ నన్ దలంపుమా. 70

చ. కలదు ధన మ్మనంతముగఁ గంటికి మింటికి నంటు మేడుగుల్
గలవు సమస్తముం గలదుగాని యొకించుక లేనివారిలో
పల నొకరుండ నియ్యబలఁ బాణిగృహీతఁగఁ జేయనేనిఁ, గో
ర్కుల కెనగాని సంపదలు కుంకుమలేని కులాంగనామణుల్. 71

ఉ. ఏ నని తా నటంచు నొకయించుక భేదము లేకయుంటు న
చ్చానకుఁ జెప్పగాఁ దగిఁ నంగతు లేమని బోధసేతు నీ
కే నెఱిఁగింపఁ గావలయునే? యదిగాక, పురాకృతంపుఁబు
ణ్యానఁగదా! లభించితివి నాకొకదూతఁగ నీవు నెచ్చెలీ. 72

చ. అన "నిదె పోయి వత్తు" నని యాతఁడు వెన్కకు నేగ, మీఁద మె
ల్లన బసకేగి మిక్కిలి యలందురుసెమ్మదితోడ భోజనం
బొనరిచి మెత్తురాఁకకయి యొక్కెడ నొక్కఁడు గూరుచుండి తాఁ
గనఁగొనుచున్ ద్రుటిన్ యుగముగా గణియించుచు మారు దూఱుచున్. 73

ఉ. చెప్పఁగ రానివేదనలచే నలచేడియ నాత్మ నెంచి "నీ
గొప్పపిఱుందులున్ బలపుగొల్పెడి మేల్ పలుచాలు లక్ష్యమున్

దప్పని చూపుతూపులును హావరతంపరలైనలీలలన్
ముప్పిరిగొన్న మోహమున ముంచెఁగదే? జగదేకసుందరీ. 74

ఉ. చందురుబాధకే సయిపఁజాలుదునో, మదనాగ్నికాఁకకే
కందకయుందునో, ప్రియకాలునిజో దలచల్లగాలికే
వందురకుందునో సకలవాంఛలకున్ గురువైననమస్కృత
చ్ఛందనవల్లి! నీదయిన సంస్మరణాశయె మానుకొందునో! 75

మ అకటా! నే నెటు తాళువాఁడ, నటు నీవాక్యంబవుఁ జాటునన్
వికచాబ్జమ్ముల రంగలంకులను నావిర్భావమున్ జెంద మి
న్నక వీక్షించుచు లజ్జ కొజ్జవయి యానదింపఁగాఁ జేయు నా
ప్రకృతిన్ లోనఁ దలంచినంత మది నీరంబౌఁ గరంగేతుఁగా. 76

క. అని తన్మయమగు మనమున, ఘనతరమగు రాగమెదిగి కాలూన నతం
డని మేషత్వముఁ గైకొని, యును సురతావాప్తికాలము నూహించు నహో. 77

తే. గీ. అట్టు లొకకొంతసేపు మిన్నరసి యచట
కలికి గోరులసొంపు నచ్చెలియమోము
పెంపు నొకకొంత గని యతఁ డెదవిడిచి
నర్మసఖు నాత్మ నెంచి తన్నాయకుండు. 78

మ. "ఇదిగో! వచ్చెద" నంచు నేగి చనఁడేఁ డేణాక్షి యేరీతి మ
న్మదమున్ గాంచెనొ? యిట్టియుత్తరము నన్నుం గూర్చి తానంపెనో?
యదనున్ వమ్మొనరింప నెంచదుగదా? హా! దైవమా! యిట్టి క
ష్టదశాపాకము మిత్రుఁ డొప్పికొనునే? చాతుర్యమున్ జూపఁడే? 79

ఉ. ఎక్కడిమిత్రుఁ! డే వచటి కీతని నంపుట గొప్పతప్పు "తా
నక్కన కాంగి కీతఁడు ప్రియంపకువాఁ" డని వింటిగాదె? సీ!
మక్కువ యెంతచేసె? ననుమాన మొకించుకయేనిఁ గాంచక నా
డక్కున కట్టివాని వెనుదీయక పంపితి నెంత వెఱ్ఱినో? 80

తే గీ. "తెలివితేటలుగలవాఁడు ధీరుఁడితఁడు, చనిచోఁ గార్యసిద్ధియౌ" నని తలంపఁ
గూలిపోలి సామెతయొనగూడె దాని, నొగి నధమబాధఁ జేయుచుండె నేమొ?

ఉ. "ఉంటేనకాఁడొకింత కొనగోటను నైనను మీటు కెందు నా
గ్గింటిని నాయకుల్ గలుపఁగా గమకింపఁ"డటంచు మున్ను నే
వింటిని వేయిసార్లు, విధి, వీఁడిఁక నచ్చెలిమిన్న తోడ నా
యంటును సొంటునుం దెలుప కాడుచుఁ బాడుచుఁ గూడుచుండెఁ బో! 82

గీ. తనరుచిత్తమ్ము నేనియుఁ దగినసొగసు, గలుగుచెలిమిన్న కడకంపఁ గదలిరాదు
అట్టిచోఁ గేవలాన్యుల నంపనగునె? దౌత్యమునకన్న సతిపొందు తప్పదంటె? 83

క. పురుషుఁడు పురుషునిసంప్రతి తరుణి తరుణిసంప్రతయును దగ దొండొరులం
డొరుల ననుపఁదగు దౌత్యము, విరచించెడిపట్లఁ గడువివేకము మెఱయన్ 84

మ. అని మిత్త్రుం గడు దూఱుచున్ మనమునం దాలోచనల్ సేయుచున్
వనితన్ లోఁదలపోసి యుల్కిపడుచున్ వైరాగ్యముం గాంచుచున్
దనకై తాఁ దుటకేగ నూహగొనుచున్ దర్కించుచున్ దాపమున్
గనుచున్ గుందుచు నుండెనంత హితుఁడున్ గన్పట్టె దౌదవ్వులన్. 85

క. కని "యతఁడగునో కాఁడో", యనియును "కార్యమ్ము సఫలమయ్యెనో లేదో"
యనియును "నిష్కారణమిత్ర్యనఘాత్ముని దూఱితి నాఁడ" ననియును గనుచున్. 86

తే. గీ. అంత దగ్గఱ కేతెంచి "యనఘ! నీకు, పనుపునన్ జని యాళిపత్రికఁ
గాంచి మెలమెల్ల నీప్రసంగమున డించి, తెలిసికొంటిని మదినున్న తెఱఁగు కొంత. 87

క. అంగీకృతి సూచింపద, నంగీకృతి తెలుప దెందు నతివలు లేరే?
రంగైన మిన్నకుంటి భు, జంగుఁ పిలువ పంది యుట్టివందము కలదే? 88

చ. అయినను నాలతాంగిహృదయంబొకకొంత భవత్సమాగమ
ప్రియముని కొన్నిచెయ్వుల నెఱింగితి నంతఁ దనంత నెమ్మిఁ ద
ద్దయుఁ గతినాత్మ యాత్యతిపతల్లియు నయ్యెడ కేఁగుదెంచె నా
కయు మొకకొంత దెల్ప నది సమ్మతి గన్పడఁ జేసి యిట్లనెన్. 89

ఉ. ఏయెడనైన "నియ్యతివ యెవ్వనిసాని?" యటన్నవో "ఫలా
నా" యని చెప్పికోఁదగిన నాయకుఁ డబ్బిన మాకుఁ గీర్తియౌ
"నీయనసాని యెవ్వతయొ యెట్టిదియో?" యని నప్పుడో "ఫలా
నా" యని చెప్పికోఁదగిన నాయిక గల్గిన మీకుఁ గీర్తియౌ. 90

తే. గీ. ఎట్టులేనియు మర్యాదయే ప్రధాన, మనుచు వర్తింతు నేకాని ధనమదెంత
వచ్చినను వేఱురీతుల కిచ్చనేయ, నెఱుఁగరే? మీరు నామనోవృత్తిరీతి. 91

చ. ధనికుఁడు రూపశాలి గుణధన్యుఁడునున్ వదాన్యుఁడున్
జనవయ సొప్పువాఁడు నెటుచేయుఁ? బాల్యుఁడుఁ డెట్టకేలకున్
దనకు లభించె మీకృపకతమ్మున, నియ్యెడఁ దక్కఁజెల్లునే!
యనవగువాని మానఁదగునా? మనకెల్లపు డిట్టిఁ దబ్బునే? 92

ఉ. కావున మీరుచెప్పరసికప్రియునన్ గని శంకఁదక్కనే
నీవిధిఁ జెప్పినట్లు వచియింపుఁడు "నామతనూజపైఁ గడున్
భావము మీకుఁ గల్గుటది భాగ్యము కాని సదా కళత్రసం
భావన దీనిఁజూడఁదగుఁ బ్రాయము శాశ్వత మానె? యోకిన్. 93

క. విషమవలసివచ్చిన లో, గడ నిచ్చిన దట్టులుండఁగా దానికి ము
మ్మడుగధికమిచ్చుటను ని, ష్ఠుడ పత్రము వ్రాసికొనుఁడు పూవుంబోఁడిన్. 94

క. "మోమాట మించుకయును లే, కీముసలిని యిట్టులనిమె నే?" యనకుఁ దహో!
"కామువు లెక్కడ? సత్యము, లేమాడ్కి?" నాకుఁ గ్రొత్తలే! యివియెల్లన్. 95

తే. గీ. మొదల నేర్పాటొకం డిట్టులాడవేని, మేమె మీరయి మీరలే మేమునగుచు
నుండఁగావచ్చుఁ గూడనే?! తండిపట్ల, మటియువ్యవహారపుం దు మాటకులు న 96

గీ. అందఱింబోలెఁ జలువుర నాశ్రయించి, యొకరికనుఁ బ్రాము యొకరితో నెకవికలకుఁ
బోవుటలు వాగ్వహమ్మనపూవుఁబోఁడ్లు, సేర రిది మీకుఁ బదపడి నిక్కమగును. 97

చ. వలపు గలన్ని వాళ్లు మగువా! చెలియా! సకియా! తలోదరీ!
చిలుకలకొల్కి! యంచుఁ గడఁజేరకచేసి సమస్తవస్తువుల్
పలుమఱు తెచ్చియిచ్చి యటుపై నది కొంచొక తగ్గనేని యి
క్కలికి మొగమ్ము మూడ రిది కాముకధర్మము నే నెఱుంగుదున్. 98

చ. కలసినకొన్ని నాళ్లొకటిగాఁ గనుపట్టెడి మేను లై దినం
బులు చనుమీఁద రెండునయి పోవఁగఁ బోవ మగండు వాలు నై
వలపు క్రమమ్ముగా నుడుగుపట్టున సానియవస్థ చూడఁగా
వలయు మఱొకఁ డట్టియెడ వచ్చునొ? యిచ్చునొ? కామితార్థముల్. 99

చ. వదలినఁ జచ్చిపోము మనమైఖరి యియ్యరయుంచు నెందుఁ దా
మొదలఁ గనంబడున్ బిదప మోహముతగ్గియు జ్ఞానమబ్బిరో
మదవతికన్నఁ బూరుషు మానస మొండొక చుల్కఁబొఱు న
ర్యదిగనిపెట్టలేరు వెంయాంద్రము నేగతి ముప్పనెగ్గడిన్?

చ. తగినటులుండు చేకుఱఁడు తారసమైన ధనమ్ము నీఁడు సో
యగమును నీగియొక్కగలుగు నట్టిఁడయేని యతండు నిర్ధనుం
డగు మన మిచ్చువారు కలరా? ధనమిచ్చెడి వారె కాని, యే
మగువకు నేని సౌఖ్య మనుమానము మాగణికాకులమ్మునన్. 101

గీ. "సానులను జేయుటుడిగి లోకానుగతిని, బెండ్లియొనర్చుకొనరాదె? వెలవెలందు"
లంచుఁ గొందఱు బోధింతు రదియునంత, మంచిత్రోవ యటంచు నామదికి రాదు. 102

శా. త్రాగుంబోతులు జూదగాండ్రు వనితాగ్రస్తప్రియుల్ సోమరుల్
భోగంపుంగొలమందుఁ బుట్టుపురుషుల్, పూఁబోఁడ్లు విద్యావతుల్
యోగోద్రేకిను లుత్కులార్వ లెటు లీయోపాయముల్ నీచులన్
భోగింపం దగువార లిట్టులయినన్ బోకున్నె? మర్యాదయున్. 103

ఉ. సానిగఁ జేసెనేనియును శాస్త్రులుఁ బంతులు మంత్రులున్ ధరే
శానులు వైశ్యరత్నములు సంపద గల్గెడి యెల్లవారు సం
స్థానము గాచు సేవకులచందమునం దనయిల్లు గాతు రిం
కేఁటినాక్షికిం గలదె? యిట్టిమహోన్నత భోగభాగ్యముల్. 104

సీ. "ఏకలెక్టరు లేదింత వ"ర్కౌనుభంగి నుత్తరమ్ములును బ్రత్యుత్తరములు
"ఏడాక్టరును లేదింత యల్జడి" యన్న చందాన నిలుగాచు సారటులును
"ఏజనానాను లే దీచంద" మనుభంగి నూరేగం బొనరించు చేడియలును
"ఏదేవతను లే వీకాన్క" లనుశేవ ఫలప్రముఖ వస్తుపటలములును

తే. గీ. తనకొలమ్మునఁ బొడమిన మనుజు నొకనిఁ గట్టికొని కాఁపురము సేయుఁ గలికి కెట్లు
గలుగ నేర్చున? సానియై వలచి వలపు గలుగఁ జేసెడి కలికిమిన్నలకు దక్క.

తే. గీ. జగతి "వాణిజ్యకృషికర్మ జనవరేణ్య, సేవనమ్ముల సంపదల్ చేరు" నని
చెప్పుదురు గాని తగినట్టియొప్పు గలుగు, సానిగడనకు నవి శతాంశములు గావు

తే. గీ. నీచ మిదియందుఁ గొందఱు నీతివిదులు, పలుకుదురు సత్యమే యట్లు పలుకువారు
పలుపువృత్తుల నిట్టినైచ్యం బొకింత, లేదె? యొక రొండొకరి నెంచలేకపోరు.

శా. ఉద్యోగం బని ప్లీడరీ యనియు నెంతోమంది శ్లాఘింతు రా
యుద్యోగంబు శ్వవృత్తి రెండవది తానొక్కొక్కెడన్ మాపనిన్
"హృద్యంబౌ" ననిపించు లాభమది యొండేఁ గల్గు నావృత్తి సం
పాద్యం, బయ్యది పూజ్య మెల్లగదు, నీచానీచతల్ చూచిరె? 108

క. ఏకార్యంబరయ లోకస్థే కడపాటను స్వవృత్తి నే తద్వ్యక్తిన్
దాఁకుఁ జసత్యమ్మిది వే, శ్యాకాముకు లైనరసికు లారయుఁ డదిన్. 109

క. ఏవృత్తిఁ దలఁచి చూచిన, నావృత్తిన్ దగినకష్ట మందుండెను వే
శ్యావృత్తికి సెజ్జపయిన్, గావలసినయంతపసిఁడి గలిగెడిఁగాదే? 110

తే. గీ. అయిన నే మిట్టిమేలైనయట్టి వృత్తి, కిప్పు డెన్నెన్నియో సంఘటించె ముప్పు
లక్కతమ్మునఁ దగినంత యట్టికట్టు, దిట్టుబలు చేసినన్ గాని దీఱదింక. 111

గీ. అనుచు నేమేమియో చెప్పిన దాయఁ, డానవము వికసింప "నో యనఘ! వృద్ధ
గోరు టది తప్పగా దిది క్రొత్త యగునె? యెవరుగోరరు? కూఁతుల నిచ్చుపట్ల.

క. వారలు గోరిన నది యొక్క, తీరుగఁ గనుపట్టుఁ దగమతిన్ దలపోయన్
ధీరులకు నదియు నితరము, నారూఢిగ నొక్క విధమయగుఁ దుద కెన్నన్.

ఉ. ఇంతకు నేఁటిరేయి నను నేణవిలోచనతోడఁ గూర్ప నా
యింతి యనుగ్రహించెనొ? మఱి యెట్టిదియే నిదిగాక యద్దునో
క్కింత వచించెనో? నొడువు మిచ్చట కెన్నఁడు వెన్కఁదీయ నే
యింతికి నేనిఁ దప్ప దిది యేటికి నాకడఁ జెప్పఁగావలెన్. 114

క. అనవుడు నతఁడిట్లను నే, నను నిట్లని చెప్పి తన్మనోగతిఁ గలవ
ర్తన నెఱిఁగితి నంగీకృతి, కనుపట్టెన్ జనుట తడవుగా? మన మింకన్. 115

ఆ. వె. అనుచు నయ్యుదాయ నచ్చెలిమిన్న కే, శిగ్రహమ్మునకుఁ జెలిమిదలిర్ప
వెంటఁ బెట్టుకొనుచు వే దీసికొనిచనె, నర్మసఖుఁడు కామధర్మవేది. 116

గద్య.

ఇది శ్రీ... తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం

బైన పాణిగృహీతయందు

ద్వితీయాశ్వాసము.



# పాణిగృహీత.

## చతుర్థాశ్వాసము



క. ఆగభక్తిగుంఫిత
జోగంటి రామయార్య సుచిరకృత తపో
యోగపరిణామ లలిత
శ్రీగంధర్వాభిరామ సీతారామా.

తే. గీ. అవధరింపు మనంతరం బత్తలోదరీమణి ను వాయఁ గల్పి యా కాముకుండు
చిన్నవోయినమోముతోఁ జెలియ ఘనము, నందుఁ దలఁచుచుఁ దనయింటికరిగి పిదప.

మ. అకటా! పిన్నటనాఁటనుండియును నా యానంద మానందమై
వికలత్వమ్మను దాద్పళంబయి దయావిర్భూతిమై నెందు భి
న్నకృతుల్ నేరకయున్న నెచ్చెలికి నన్యాస్యంబు నేఁ డబ్బినన్
వెకలిన్ జేసెఁగదా? వృథా వెలచెలిన్ బ్రేమించి కామించితిన్. 3

ఉ. నావలనన్ గ్రహించె లలనామణి బాహ్యరతాదిసర్వసం
భావన లక్కటా! యిది సెబా! సని యన్యుఁడు మెచ్చనయ్యె; గో
దావరి పుట్టు టొక్కయెడ దానిప్రయోజన మింక నొక్కచో
నీఁధి గొత్తయే? యెఱిఁగి యిమ్మెడ నేఁ దపియింప నొప్పునే? 4

శా. నాకన్నన్ గడ లేఁతప్రాయమును విన్నాణమ్మునన్ దేజమున్
శ్రీకూలంకవభోగభాగ్యములు నాసిన్ బోల్చ నవ్వానితో
నేకీభావము నంది యియ్యబల నన్నేమాముఁ గామించు? నే
నీ కాంతామణి కింక నీర్ష్యచుచునే యెబ్భంగి నుత్తమ్మగున్. 5

చ. అరమరలేక చిన్నతనమాదిగ నొక్కటిమై పరస్పర
స్మరణముదక్క వేఱొకవిచారము దూరముఁజేసి విప్రలం
భరసము వెళ్లఁబుచ్చుచుఁ బ్రపంచమెఱుంగని యట్టి యుగ్మముల్
విరహముపాలు సేయు నవివేకికి ధాతకు జన్మమున్నదే? 6

ఉ. సానులు లేరె! యీజగతి, జాణలు గారె? మనమ్ము నీరె? యే
సానికి నేబొఱుంగునటు సఖ్యము లేగతి గల్గెఁ? గల్గుఁ బో!
యీనియతిన్ మఱొక్కనికి నింతిని దానయి కూర్చి పొక్కనో?
మానము దక్కెనెందు వెలమానిని నమ్మఁ? యెమ్మెకాండ్రకున్. 7

సీ. కలికి యింతకు వానికెలన నల్లననిల్చి యొయ్యారముగ వీడె మియ్యకున్నె?
యబల యింతకు వాని యక్కు చక్కఁగఁ జేరి ముద్దుముద్దులు మించ మురియకున్నె!
తెలఁది యింతకు వానితలఁపులూరఁగఁ జెక్కుఁగొట్టి సొట్టన ముద్దు వెట్టకున్నె?
గరిత యింతకు వాని మరుకేళిఁ గరఁగించి గరువంపుబిగువంబు గాంచకున్నె?

తే. గీ. అబల నేనిపోఁ బ్రైకట్టి పలుక, గాంచి యింతకు నాయెమ్మె కానిచేత
ననునయమ్ము లవెన్నియో గొనకయున్నె?, చెనటిదైవమ్మ నన్ను వంచించె నకట! 8

మ. పలికెంబో! చెలి నన్నుఁగూర్చి "యొరునిన్ బ్రాణేశుఁ గావింపు" మం
చలుకన్ లోఁగొనియున్ వెలిం దెలియనీ కంగీకృతిన్ జూపి ని
క్కలుపంబౌ మదినూని వాని సతివన్ గల్పింగ నా కొప్పునే?
తెలియంజాలక మోసపోతి నిటు నీతిన్ బూనఁగాఁ జెల్లునే? 9

చ. వెలచెలిఁగూడు టొక్కయవివేకము కూడినవా రసత్యముం
బలుకమి గొప్పతప్పిదము, పాముసెడన్ బుజువర్తనమ్ములా?
సలుపుట, దేవుఁబట్టి సదృశంబగు పత్నిఁ గూర్చు టొప్పవా!
వలపున ముంచి మించి యిటు వాతులు గోతు లొనర్తు రక్కటా! 10

తే. గీ. అనియెఁబో! లంజెయాటఁ దాఁటిమాట, నాదురోగ్యతయెయ్యెడ బూదిఁగలిసె
వేయునేటికి? వెలయాఁడ్రు డాయువారి, కంతకన్నను దుర్వృత్తు లబ్బు నిజము. 11

ఉ. దానునిరీతి దానిపదతామరసమ్ముల నాశ్రయించుటం
జేసికదా? మహైశ్వర్యము క్షీణనిదుష్కృతి నెవ్వకల్గి న
న్నాసతి చేయఁజేసె నకటా! యిటు లెప్పుడు చెప్పె నప్పడే
కోసిన నేమిపాప మగుఁ? గోమలి నాలుక యింతయింతగన్. 12

తే. గీ. నన్నుఁ బిన్నాఁటనుండియు నమ్మఁజేసి తుదకు నీగతి దుర్గతిఁద్రోసి యొరునిఁ
గలసి కులుకుచునున్న యక్కులికిమిన్న, కేల తగుఁదు? నాయమ్ము రిహామునందె. 13

ఉ. ఇంతయుపాత్రురా లగుట యెల్లనెఱింగి యదేమి పాపమో
యింతిపయిన్ మనంబు పరువెత్తెడి నుత్తలపాటు జెందెడిన్
గాంత దలంచి, యార్య! "విటకాండ్రకు నెక్కడిమాన?" మంచు సి
ద్ధాంతముగా వచించు కవితల్లజు లూరక వాఁగువారలే? 14

ఆ. వె. నిక్కమక్షులైన నీట్రికాండ్రకు మనం, బీయ కిచ్చినట్టులే నటించు
రకట! వారకాంత లద్దమ్ములో మోమ, దెట్టులుండు? నదియు నట్టులుండు.

తే. గీ. మచ్చుబంగారమున కాదిమూర్తియైన, వెలవెలందులప్రేమ లోనలకుఁగొన్న
యట్టివిటులకు ద్రవ్యక్షయం బటుండ, బలువురును నవ్వ దీర్ఘవ్యాధి పైనికొనరు  16

తే. గీ. తనువునందలి సారమంతయు సడలిపోయి, నల్లనల్లన లాగి వారాంగనాజ
నంబు తమవిటులను కుబుసంబు భుజఁగు, లును వెడలఁద్రోతు రిదిగనుఁగొనరు విటులు.

చ. కొలమునఁ బుట్టి యొకకోమలిఁ బిన్నటవాఁడ పెండ్లియై
కలిగినయంతలో సుఖముగాఁ దలిదండ్రులు నత్తమామలున్
బలువురు దన్ను మెచ్చఁ గులపావనుఁ డన్నయశమ్ము లోకమం
దలరఁ జరించువాఁడివి కదా ? నిజమైన సుఖమ్ము లెమ్మిఁకన్.  18

క. అని యాతఁడు పలువిధముల, మనమునఁ దలపోయుచుండె మానినియు మదా
రునిఁ గలసి కులుకుచును నొ, య్యన నాలో నితనిఁ దలఁచి యాత్మగతమునన్.  19

మ. అకటా ! నన్నెడఁబాసి యెన్నఁడెఱుఁగం డవ్యాజరాగాశ్రయుం
డొకరిం బోలెడివాఁడు గాఁ డతఁడు నన్నుల్లమ్మునం దెంచి యే
మికతల్ సేయఁగ సాహసించెడినొ ? నామేలెల్ల నమ్మియ్యెన
మ్మిక నాపై నిఁకనైనఁ జూపఁడె ? యయో ? వాని తప్పెట్లుగన్ !  20

ఉ. వేడుక గాఁ డఁటంచు మది వెక్కసమించుక లేక "యిండోయం
గూడఁగఁ దెమ్ము" టంచు ననఁగూడునె ? విత్తము కారణమ్ముగాఁ
జూడనిచూడ్కిగా మఱి బాఁజుగులఁ గూడినఁ గొంతఁ గూడుఁ గా
కేవి యిట్టివర్తనము ? లేమనిచేసితి ? నేను మెత్తురో ?  21

క. నాకారణమునఁ గులమున, కే కానిక యొదవఁగల్గె సిహిహీ ! యిటులై
నాకత విన్నదు కోయక, యేకాముకు లిచ్చగింతు ! రిల వెలచెలులన్.  22

ఉ. ఎంతటి మానహీనులో ! మఱెంతటి యేవయు లేని పందలో !
యెంతటి బుద్ధిశూన్యులో ? మఱెట్టివారో ? విటకాండ్రు, భోగపుం
గాంత లొసఁగు హేయములు కన్నులనిండఁగఁ జెప్పు చూచుచున్
బంత మొకింత పూన రిది బాలిశవృత్తిగఁ జూడ రక్కటా !  23

శా. త్రాగుంబోతుల బుద్ధిహీనత గదా ! ద్రవ్యమ్ము సారాయికిన్
రాఁగా హేతు, వదెంత కట్టుచెడినన్ రానందురే ? నా రహో !
భోగంపుంగొల, మట్లనే విటులకున్ రోఁభగా ప్తి దుశ్శీలులై
బీగం బూడ్చిన పెట్టెయై యిటు చెడెన్ బెంపేది నానాఁటికిన్.  24

క. ఇక్కరణి నన్యయోషలఁ, జిక్కియు నవ్వానిమనము చెయ్యలఁ దనకుం
దక్కించికొనియె విటులకుఁ, దక్కినసంగతుల వైని దలపులఁ గలదే? 25

ఉ. పువ్వులవిల్తు పోరఁ గలపోకుములెల్లను నొక్కరాత్రికే
యవ్విటుఁ డవ్వేలందియును నాని సుఖించి, ర విట్టి వట్టి వం
చెర్వఁగఁ దెల్పనొప్పును? నదేమిట్రి? కింత కెఱుంగనట్టి వా
రెవ్వరు? పత్నులన్ బసువు లీసుఖ మందవె? యంత కెక్కుడే? 26

ఆ. వె. తుమ్మెటుమ్మలంత గొమ్ముసుకోయనె, నలముఁదోడఁగూఁ జల్లనైనగాలి
చుక్కవోడిచెఁ దమ్ముచిక్కలు తఱిగె, న, బ్జాక్షి వెల్లవాఱె జాఱె రేయి. 27

ఉ. అంత మదాయఁ డచ్చెలి యొసారముగాఁ దను సాగనంప న
య్యంతివిలాసముల్ హృదయమెల్లెడ వేళ్లు ఘటింప సంకటన్
ధ్వాంతమడంగియున్ దనయెదం గలధ్వాంత మనంతమై తగన్
జింతమలొందు లేక యలచేడియ నెంచుచు నింటికిం జనెన్. 28

తే. గీ. సారసమ్ములు వికసింపఁ జక్రవాక, జంపతుల కింపు జనియింప జగములెల్ల
నంధతను బాసి మోదింప హాయిబెంప, రవి యుదయమందెఁ గుముదినీప్రభువు డిగె.

చ. అటు లొక కొంత కాల మల యబ్జముఖీమణి పొందు నందుచున్
విటకులశేఖరుం డయి వివేక మొకింతయు లేక స్వీయ వా
కటకము మాటయే తలఁపఁగానక యుండెను నంత దల్లి య
ప్పటి చరిత మ్మొకింత విని పంపెఁ దదానయనార్థ మాప్తులన్. 30

ఉ. పంపినవారలో చెలిఁగఁ బాయఁగలేకపోఁబాసి "యుత్తగం
బంపుచునుండుమీ?" యనుచు సాదర ముట్టిపడంగఁ బల్కి. నై
లింపనివాసముం దొరఁగలేక యలంచుర నష్టపుణ్యకా
ర్యంపుటవస్థమెల్లఁ దనదై చనె నీగతిఁ జింతనొందుచున్. 31

శా. "అయ్యజ్ఞానఁ గన్నకన్నలనె భార్యన్ జూడ నేతెంచుటల్
వాయజ్ఞానమె రాఁజఁగన్నకనులన్ నాథున్ విలోకించినన్
హేయప్రక్రియఁ దోఁపకున్నె? యదిగా కీలోకమం దెన్న నే
స్వీకారమ్ము వారకామినులవాసిం జెందఁగా నేర్చునో? 32

మ. అనుగున్ వెన్కకు లాగివేయుటకు నయ్యబ్జాక్షి సాంగత్యమే
కదా సామగ్ర్యముఁ జెందియున్నపుడు వెన్కన్ దోడు నీవేల? యో

గాదు గా? యీనుడి గాలిఁ గూడిననఁ జిక్కుల్ వెట్టుటల్ మాని మం
దమునకున్ సాఁగగనిమ్ము నామనవి నీ పాలింపు మిప్పట్టునన్. 33

ఉ. ఈవును గాలియుం గలసి "యేణదృశన్ విడనాడి యేగు టొ
ప్పే? వల" దంచు నన్నిపుడు వెన్కకుఁ ద్రిప్పఁ దలంచినా రహో!
దైవబలమ్ము చాల దది తల్లిఁ దా నవతార మంది న
న్నీవిధి లాగుచున్నది ప్రదేమియుసేయకు మాతపత్రమా. 34

మ. జడ మీ వయ్యు జగమ్ము లెక్క తన నుచ్ఛ్వాసమ్మునం బోల్చు న
ట్టిఁడు నీకున్ సహకారి యౌటను నను బోటిం జేగ్ర నుంకించి నా
యనుజున్ వెన్కకు నెత్తె దీ, వోయలతాపాత్రిన్ హరింపన్ గదా!
పుడమిన్ బుట్టితి వాతపత్రమ! నినుం బోలన్ దలన్ దాల్పఁగన్. 35

వ. పదపడి ధూమశకటం బారోహించి యతండు.

ఉ. తల్లిని దుష్టులను చెదన్ దలపోయుమఁ దండ్రి సౌగ్యతా
భ్యల్లపనంబు నూరక యహో! యని మెచ్చుచు సారెసారె క
ప్పల్లవపాణి చెయ్యుల జపం బొనరించుచు నేగెనున్న వా
ర్లల్లరు నంత రాయ మగు టెంతయు శత్రులు నోడె రాంద్రిసన్. 36

క. రైలే దేఁ గారణమున, జాల ప్యొమ్మనరించి వెనుక జరగినచో నా
వ్యాళోలుఁ డదియుఁ "దనకనా, కూలించెడి జాలి" యనుచుఁ గొఁడోక నెంచున్ 37

ఉ. చిక్కిన మేనితో వగపు చెందెడి డెందముతో స్వతఃప్రభన్
దక్కిన మోముతోఁ దనదు నాప్రునకున్ జనుపుత్రిఁ దల్లి నా
మిక్కిలి గారవించి మునుమిందిన దెంచక, పై నొకప్పు డెం
పెక్కఁ ఫక్కి నీతి జనియింపఁ బ్రసంగ మొనర్చె నీగతిన్. 38

చ. మును పెటులైనకున్ గృహము మోపిక నీకిఁకఁ గాలిసంకె లౌ
టను దెలియంగదన్న? కడుఁదక్కరులన్ దరిఁ జేర నీకు ము
న్న? నయముచందమున్ దెలిసి నాయనకున్ యశ మబ్బఁజేయుము మ
న్న? సెనయగల్గు మన్న? ద్రవిణంబు వ్యయింపకు మన్న? నమ్మగన్. 39

ఉ. ఏపని కీడ కేనియును నేగిన నయ్యెడ గేహవిస్మృతిన్
గాఁపుర మాచరించు టది గాదు గదన్న? కళత్రి మెంతయుం

దాపము నందుదుష్కృతులఁ దారకుమన్న ? యొకింత పూర్వులన్
దాపసచర్యలన్ దలఁచి తద్గతి నిల్వఁ గదన్న ? మేటివై. 40

ఉ. వచ్చెడి రైతులన్ గని జవా బెవరిత్తురు ? సాహుకార్లకు
న్నచ్చెడిరీతిఁ జెప్పఁదగు నాయకు లెవ్వరు ? తండ్రి నాఁడె తా
నిచ్చినసొమ్ము పుచ్చుకొను టెవ్వరు ? కోరెడివారి కప్పు లి
ప్డిచ్చుట దెవ్వ ? రెక్కడికి నేగిన నక్కడ కాఁపురమ్ములా ? 14

తే. గీ. ఎన్నిజన్మమ్ములఁ జేసి ? రెన్ని యగ్రహారములు తెచ్చి ? రెంతటి కన్నమిడిరి
భూము లెందఱికిచ్చిరి ? పూర్వు లందు గుర్వ్వయంబింత లేదు దుందుడుకు చనునె ?

తే. గీ. ఎంతద్రవ్యంబు ముందు నీవింటనుండి, తీసికొనిపోతి! నామీఁదఁ దీఁగకతన
మఱలఁబంపితి దియెంత? యెఱుఁగుదే? కుమార? యిది మొల్లనెయ్యిక మఱిఁగిపోయె.

ఉ. ఈగతిఁ జెల్లఁజేయు వన మెక్కడి లెక్క ? ధరాపురందరుల్
జోగులుగారె? యాన్నృపులఁ జూచుటలేదె? యిట్టులుంచు మే
లాగు సహింతురా ? సకలలక్షణముల్ గలభార్య యుండఁగా
భోగపుఁదొత్తులన్ మరగఁబోయెడినీకత లాలకించుచున్. 44

ఉ. వత్సరమైనఁగాదు జనవంద్యుఁడు తండ్రి గతించి, నీకు నే
తత్సమయమ్ము నిస్తుమియఁ దార్చుటమాని యయోగ్యతాఖనుల్
కత్సిగ లగ్రజాతులకుఁ గూడనిచేష్టలు లంజెముండ లం
దుత్సుకతాధరంబు గొనుటొప్పునె ? కర్మము కాలిపోవఁగన్. 45

ఉ. వింటిని నీదువైఖరులు వీనుల నూచులు నూడినట్టు లే
యంటును సొంటు లేని కుల మక్కట! గంగను గల్పు నిన్నుఁగై
కొంటిమె ? కొంటె మెచ్చెలను గూడుక గాడిదరీతి భోగపుం
గుంటలయిండ్లు దూరెదవె? కూళవె? గోలవె? బేలవే? సుతా ! 46

శా. అన్నా ! వైనట బాంధియుంట వినికీయుం టక్కటా ! నీవు నీ
విన్నాణం బెటులబ్బెరా ? ద్విజకులానిర్భూతియుక్తా బానమున్
మున్నెచ్చో వినలేదు నీదుకులనే మున్నెన్ మహాపాప, ము
చ్ఛిన్నంబయ్యెఁ గులమ్ము నీకతన ఛీ! ఛీ! గోత్రవిధ్వంసకా!

చ. నయము భయమ్ము నెమ్మదికి నాఁటఁగ దల్లి యొనర్చుబోధ య
మ్మెయి విని మోమువంచి పయిమిక్కిలి యుత్తరమీక "యెవ్వఁ డ

ప్రయనములోని చెయ్యులను బాయక యియ్యెడఁ దెల్పు" నంచుఁ ద
ద్ధయుఁ దనలోన సిగ్గిలు నుదారుఁడు లో మఱియొందు దోఁపమిన్. 41

తే. గీ. అట్లు వినయంపుఁగనియయి యన్నపానములకు పయితము లేదని ముగ్ధుఁ గాంచి
లోననించుక చింతించి లోలహృదయ, యగుచు నాసతి దానిట్లు లనియె మఱియు. 48

చ. ఎఱుఁగక చేయు కార్యముల కేమి? యిఁకేనియు బుద్ధిఁగల్గి యు
ద్ధరితము వాయఁబోంటె గురుదోషనివారిణి గంగ కేగి యు
క్కుఱుమెయిఁ దండ్రికింగతులు కల్పనచేసి పురమ్ముఁ జేరు వ
త్సరమును గాకమున్న యిటుసల్పుట యొప్పగునంచుఁ బల్కుడున్. 49

చ. "ఒకవినసి గ్గడంప నిది యొక్క యుపాయము గల్గె" నంచు నో
ప్పిదముగఁ దల్లియాజ్ఞ గొని పెద్దలఁ గొందఱి నామె తోడుగా
సదమలబుద్ధులన్ బనుప సాయముగాఁ గొని యాత్రఁ దేగ న
మ్మదనహారాలయమ్ము పరమప్రథితార్థపురాశి గాశికిన్. 50

సీ. అమరగర్భునకు వింతలై స్వాంతమును దన్పు దేవళమ్ముల దీప్తు లావహిల్ల
విరుపక్రక్కలను నభోంతరము దాఁటిన మేటి మేడలసౌధ మిర్కిట్లు గొలుప
నెఱుఁజూడ నవటనే యింతయాచ్ఛాదనంబును లేని లింగాల పాలుపులెసఁగ
వాలుశాస్త్రములు నధ్యయనంబు నొనరించువిద్యార్థు లెల్లెడ వేక్క నింప

తే. గీ. నెన్నియో దేశములనుండి యేగుదెంచి, నట్టితీర్థికజనము లెప్పట్టునఁదగ
నూతఁపట్టినగతిఁ బొల్చు సురనది పరి, సరమునం దొప్పుఁ గాశికాపురవరంబు.

తే. గీ. ఎన్నియోఘట్టములు, నటనెందఱొందఱ, రోమహాత్ములు సన్న్యాసు, లామహాను
భావులను గొల్చి జ్ఞానమ్ము బడయుగేస్తు, లెల్లయెడ నొప్పునప్పురంబింపు నింపు.

శా. గంగాస్నానము నాచరించి పిదపం గాశీశు సేవించి మీఁ
దం గామామరకల్పవృక్షమగు తద్భాగ్యన్ విశాలాక్షి భ
క్తిం గేల్మోడిచి మ్రొక్కి మాధవముఖాదిత్యార్చనల్ సల్పు పూ
తాంగుల్ వేలవేలు వొల్తు రట నిత్యంబున్ విముక్త్యర్థులై. 53

ఉ. తాదృశమైన యప్పురముధన్యత నెవ్వఁడు సెప్పఁజాలు? బ్ర
హ్మాదులు లోకజాలము లయంబగునప్పుడుఁగూడ దాని గా
రీదయితుండు శూల మలరించి తదగ్రమునందు నిల్పు నిం
కేదగు దానిసాటి? నుతియింపఁగఁ జెల్లదె? కాశికాపురిన్. 54

ఉ. ఆపురిఁ జేరి యాతఁ డటఁ నాదరణీయము లైనకృత్యముల్
వే పచరించి దానములు వేలకువేలుగ నిచ్చి భూమిదే
బాపల గొందఱిన్ దనిపి పైఁ గయ కేఁగి యటన్ బితృప్రియా
కాపరిపూర్తిఁ జేసి యట సాఁగి స్వదేశము బోవుదెంచుచున్. 55

చ. తిరిగియుఁ గాశికేఁగి యట దేవళముల్ మఱికొన్ని చిత్రముల్
పరిపరిగాంచి గంగ నటఁ బట్టఁ బ్రయాగకు నేగి తత్పురి
త్సరసముఁ బట్టి యప్పురిని సొంపగు కోటఁ గట్టి మేటియౌ
బ్బురములు నూచి యేగఁ దనపొలికి నాప్తులతోడ వేడుకన్. 56

తే. గీ. జనని కభిషేక మొనరించి సతియుఁ దాను, నమ్మహాగంగఁ బూజించి యగణితముగ
విప్రులకు నన్నదానంబు విస్తరించి, తల్లి సంతసమంద నుదారుఁ డంత. 57

శా. సంసారస్థితిఁ జక్కఁబెట్టుకొనుచున్ జాయన్ దగన్ జూచు చా
త సాహాయ్యముగాఁ బ్రవర్తనము మెచ్చన్ జేయుచున్నంత మీ
మాంసన్ జేయక తల్లి యాతనియెడన్ మర్యాద నీక్షించి "ప్రి
ధ్వ సప్రశ్రియ తగ్గ" నంచుఁ దలఁచెన్ దత్త్వంబు నూహింపమిన్. 58

ఉ. "అచ్చెలిఁ జూచు టెట్టు? లిఁక నయ్యెడ కేగునుపాయ మెద్ది యే
యొచ్చెను చేసినన్ జనని యొప్పెడి!" నంచుఁ దలంచునంతలో
నచ్చపలాక్షి యయ్యెడకు నాత్మపురమ్మును వీడి మున్నె తా
వచ్చుటఁ జేసి కమ్మఁ దగ వ్రాసి తనంతన యంపె దూతికన్. 59

ఉ. వచ్చిన దూతిచేతి "కిదె వచ్చితి" నంచు లిఖించి యిచ్చి పో
నిచ్చి మనమ్మునన్ బెరుఁగు నిచ్చలు మోమునఁ బొంప నంతలో
హెచ్చెడి యుత్సుకత్వమున కెద్దియుఁ బారము గాక యేగఁ దా
నచ్చపలాక్షిఁ జూడఁగ నుదారుఁడు లోన భయమ్ము గ్రమ్మఁగన్. 60

ఉ. "ఉత్తరమైనవ్రాయ విది యుక్తమె! నీ" కని యింతి పల్కఁ బో
"నుత్తరమేమిచెప్పుదు సఖీ! మది నెంతటి పేర్మి తేనిచో
నత్తరళాక్షి తాన యిటకై చనుదెంచు నె? యెంతదూర మ
ప్పత్తన! మంబ హేతువునఁ బంకిలచిత్తుఁడనైతి నక్కటా! 61

ఉ. అంబయుఁ గాదు హేతువు రహస్యమునం దొకయుత్తరంబు నే
కంబుజనేత్రికిన్ బనుప నాపె నివారణచేసెనే! నిమి

త్రం బిటు వేఱుకా దొకస్వకంత్రిక లేమియొ కాదు కాదు డెం
దం బదియేమొ! యెప్పనికిఁ దార్చిన నేగదు నాఁటనుండి యుక్. 62

చ. కలికియొ కారణంబిచటఁ గాఁదగు న త్తరళాక్షి వీడి నే
వలికరుదెంచు టాదిగ నవీనవిధం బొడఁగూడె నేమియుం
దలఁపదు చిత్త, మేమిటికతం బని చింత యొనర్పఁ దాను నం
దులఁ జొరబాఱ దిప్పటికిఁ దోఁచె నిజ మ్మిది" యంచు నెంచుచుక్. 63

ఉ. నేరము సేయఁమానవుఁడు నేతకడక్ జనుపోల్కి మోమునం
దీఱిదైన్యముక్ మఱి మదిక్ గదుభీతియుఁ గొంతలజ్జయుక్
వారక తోఁప నచ్చటుల వారిజలోచన యున్న చోటికిక్
దారె ను దారుఁ డట్లు మఱుఁ దన్వ్యలపట్లఁ గృతాపరాధికిక్. 64

క. నలుగడలు గాంచి పదపడి, జలజముఖి వసింపున్నహాముచాయఁజని యటక్
గలకలికిఁ గాంచినంతన, పులకలు గనుపట్టె మేను పొంపిరివోయెక్. 65

చ. తనుఁ గని మాటలాడ దొకదండము పెట్టుచు మోము నెత్త ద
న్వనరుహనేత్రి యుంచు మది వంత యొకింత యఱఁగాంచ కల్లన
ల్లనఁ బ్రియురాలి దగ్గఱి కలాపకలిక్ జెను గీఁటి మోము నె
త్తిన శతపత్రినేత్రి యొకతీరున నవ్వులు జాలువాఱఁగక్. 66

ఉ. కొఁడొక నేపు నేర్పుమెఱుఁ గొంచెతనమ్మున మిన్నకుండి "నీ
మిందతనంపుఁ జంద మిది మేలుగనున్నది యట్టివాఁడవా?
వెండియు రేపె వత్తువని వెళ్ళితదే యొకనుందు చేసి రా
కుండుట నీకుఁ జెల్లె నిటు లొంటరి నెవ్వరు నేర్తురే బళీ!. 67

చ. ఇరువదియేండ్లప్రాయము మఱియే గడునంతకు మిన్నకుండి పై
"నరువదియేండ్లు ముప్పు వదు" నన్నటు లే నిసుఁగట్టికొంట యి
క్కరణి విచారమందుటకె కాక సుఖమ్ముకా? నిజమ్ముగాఁ
బురుషుల నమ్ము మానినికిఁ బొక్కుటదక్క మఱొండు గల్గునే. 68

మ. మఱు లేకీకరణమ్ముగాంచకయె నమ్మ న్నమ్మికల్ చాలకో
కుతుకంబుల్ నెఱవేఱకో సిరులు లేకో యేదియో మూఁడియో
పతికిక్ భర్తను నత్త దొక్కయెడ నీసఖ్యమ్ము చేకూఱ దు
ర్మతియై దానికి దైవ మెయ్యదియొ సంపాదింపఁ బ్రత్యూహముక్. 69

చ. నినుఁ గనుఁగొంట కిక్కరణి నేఁడయి వచ్చితి నన్నుమాట యే
వనితయు నేని మాకొలము వారలలో వినె నేని నవ్వకుం
డునె? యెటు నేని సానల కిటుల్ చను టొప్పునె? దానికేమి ప్రీ
తినిగనఁ జేసి తిట్టురగుదెంచుశ్రమమ్మున కోర్చి యొమ్మెయిన్. 70

ఉ. "లంజెగదా!" యటంచు మది లక్ష్య మొకింతయు లేమి వీడితే
నిం జనుగాని యొక్కచెలిపీడి యొకొక్కకఫక్కి నొప్పు "నీ
మంజులవాణి యిట్టి" దనుమాదిరి నిర్ణయ మాచరింప న
క్కంజభవుండు నేరఁ డనఁగా నొకపాటి బొజుం గెలుంగునే. 71

చ. వెలచెలినై జనించి కనువేఁదులు చెందినపట్లు దానికిన్
గలుగుట యబ్బురంబె! పలుకష్టము, లాడ్ల ననంగ నేల? చం
చల మగు నాదునెమ్మనము చందము నింద యొనర్తుఁ గాక యే
లలనలు గాంచిరో? సుఖములన్ వలపుల్ తలకెక్క పిమ్మటన్." 72

చ. అని పలుమాఱు దూఱు చెలియన్ దగుమాటలు సెప్పి కొంత సి
గ్గున కఁగు చెయ్యులన్ గొలిపి కొంత క్రమమ్మగ సుప్రసన్నఁగా
నొనరిచి మించుపేర్మి దళుకొత్త "సఖీ! నినుఁ బాయుటాదిగా
మనమది యేమొకో! పనిమాలిన దయ్యె నిజమ్ము నమ్మమీ. 73

ఉ. ఇంతియు కాకయున్న నిఁక నేపని నేనియు మాను టొప్పఁగా
కింతిరొ! నీకు నుత్తరము నేనియు వ్రాయనె? యంత పంపనే?
కంతునిసాక్షి నేఁడు నినుఁగాంచితి నెమ్మన మెప్పటట్లు ని
శ్చింతతఁగాంచె నింతయును సిద్ధము నమ్మిన నమ్మకుండినన్. 74

ఉ. వచ్చినతత్క్షణంబ మగువా! యలకాశికి నేగి వాఁడఁ బై
నచ్చగఁ యాత్రఁ జేసికొని యక్కడనుండియు మొన్న వచ్చితిన్
బచ్చనివింటిజోదుకృప వచ్చితి వంతన నీవు, యాత్రకున్
వచ్చెఫలంబు, నిక్క మిది వంచన సేయఁడు దైవ మెవ్వరిన్. 75

ఉ. ఈవును నేనునుం గలసి యియ్యెడఁ హాయిగ నుండవచ్చు సౌ
ఖ్యావహ మీపురంబు, మనకన్నియు మంచివె కాని తల్లిగా
రీవిధ మొప్ప దామె కిది యించుకయున్ దెలియంగ రాదు కో
పావిలయై యహో మనకు హాని ఘటించుట నిక్క మెమ్మెయిన్. 76

ఉ. కావున నీవు గోప్యగతిగా వసియింపుము నాదు నామ మెం
దే వచియింపఁబోకు వచియించిన మాత్రన యేమిగాని యే
యేనిధికైన గోప్యగతియే కడుఁ శ్రేయముఁ డాఁగునంచు నుర్
గేవల మెంచఁగూడ దపకీర్తియుఁ గీర్తియు రెండు నట్టివే. 77

ఉ. పేరగుదాన వీవు, కడుఁ బెంపుగలట్టిది మాకుటుంబ, మీ
కారణమైన రహస్య మది గావలసెన్ మఱి యెంచురీతి యే
నే రెటు సంచరించెదరో యేరికిఁ గావలె నింతవట్టిలో
నూరను గాని యిట్టిపురి నొక్కని కొక్కని జోలి గల్గునే. 78

క. మీపురము లొక్కపదియా, మాపురి విడఁ దీసి కట్టు మానిని! దీనన్
గాఁపురము సేయు గేస్తులు, దాఁపునఁ గలవారి పేరె తామెఱుఁగరనూ. 79

తే. గీ. అట్టిసంగతిలో నిటు కథిక మాక, ముందు మావీధి, యిబ్యోతనుండు నిన్న
నెవఁడు గుర్తించి మాతల్లికెఱుఁగఁ జెప్పె!, నట్లయిన భయమేలన? నదియు వినుము 80

ఉ. మీపురిలోన నే సలుపు మిక్కుటపుం బను లట్టు లుంచు మే
యేపను లేను నీపడకయింట నొనర్చితి వాని నన్నిటిన్
దాఁపక చెప్పినా రెవరో తల్లి, కిదెక్కడివింత? చూడఁ దా
వ్యాపృతి తానయై జగముపై కనుగుర్ నిజ మింత కోమలీ." 81

క. అనవుడు జలజాక్షి యుం బ, గ్గన మండిన పగిదిదోఁపఁ "గులవనితగ న
న్నను జూచెదనను తుది యో, ల్లను బోయెనె? యెంతలోఁ గులటనైతిఁ గటా! 82

క. జారుఁడను దుర్యశము పర, నారీల, జోరగతిఁ గూడు నాయకునకు నా
మారమణిఁ గొనిన నీయుప, కీరితి లే దిపుడు నీదుకృప వింటి నిటుల్. 83

క ఏలంటె వచ్చుఁ? దానై, వేలకువేల్ మైఖలున్న వీటికి నీ కి
ల్లాలనను కొంటి "గలదే, రై" లను మల్లైవఁ దనకు రానేల? యిటుల్. 84

క. యోగినిగతిఁ గాలమ్మును, నే. గడపుచునుండ నీవు నేసుభ్రమై నన్
భోగినిగఁ జేసి చింతా, భాగినిగాఁ జేయు నంటి పాడయితిఁ గటా! 85

తే. గీ. మొదల మాతల్లియాటల మోసపోక, పురుషసాంగత్యమున బుద్ధి పోవనీక
యుండ నాముండయొక్కనికొప్పఁ జెప్పె, వానినా నాఁడ పోఁగొట్టి వ్రతముగొంటి.

ఉ. దానికి నంతరాయమయి దాపర మైతివి దానికేమి నా
మాన మెఱుఁగకే కడుకుమాళముఁ నెన్ దగునిన్నుఁ జూచి యూ

యూనిధిగా గణింప కకటా! తుద కెందుకుఁగాని పాడునై
బానిసతో త్రసై చెడితి భారము నీకయితిన్ వృథాగతిన్. 87

ఉ. ఎందుకు సృష్టిచేసెఁ బరమేశ్వరుఁ డీచెడుగుం గొలమ్ముఁ? పై
నందముఁ జందమున్ గలుగునట్లు లొనర్పఁగ నేల? చేసెఁ బో
పందల కెల్ల విందొనరుపన్ విధియింపఁగ నేల? యూరకే
కుందఁగఁ జేసి యక్కఱణిఁ గుత్తుక గోయఁగ నేల? యక్కటా. 88

ఉ. అందముఁ జందముం గనియు యాదరము న్నిజ మంచు నమ్మియో
వందలు వేలు నీయఁదగు వాఁడనియో యొకమాయ దానికిన్
డెందము నమ్మి వానికిఁ గడిందిగఁ బ్రియము ధారవోసి యం
తం దను వీడ నెడ్చిడియు నాధనులమ్మగఁ బుట్టఁ జెల్లునే? 89

చ. కలుగుట దుర్లభం బొకఁడు కల్గినఁ బెద్దరవాక్య మందుకున్
దలఁకక యొప్పుకొన్నఁ దుదిదాకను నెగ్గను వానిచెల్మి యే
వెలచెలియేని యొక్కఁడెడఁ బ్రీతియె ద్భుట తప్పిదంబు, పం
డలయినఁ దప్పనొందుగతిజన్మలు దీన జనింపు టొప్పునే. 90

చ. కలిమిని లేమి నొక్కగతి గౌరవమున్ బచరించుచున్ దళ
త్తళ గల జవ్వనమ్ము దిగఁ ద్రావినపిమ్మట నేనిఁ బూర్వపుం
జెలిమి యొకించుకేని యెడనేయని పెన్మిటి గల్గునింతి కం
జలి యొనరింప నొప్పు దివిపత్నిప్రతి యైనసాని యైనకున్. 91

సీ. తగినసంతాన మ్మదయమంద "నాయనా!" యని వార లెవ్వాని ననఁగవలయు?
అన్నదమ్ములు గొరవార్హు లుండిన వారు తల లేమసంచు నెత్తఁగవలయు?
తనుఁగన్నతండ్రి యం తమ్ముఁడేని యతని మొగమ్మెమిగతిని దాఁకాంచవలయు?
ఏదేని శుభకార్య మేగిర నెవనితోఁ గాంతునైఁ బీఠ మెక్కంగవలయు?

తే. గీ. నక్కటా! తాను బాడగు టట్టులుండ, వెనకముందటివారల వెలికిఁ దార్చు
రోవెలందుల పుట్టువుల్ రోఁత గావె, యెఱుఁగనేర రీమర్మమ్ము హీనమతులు.

ఉ. అట్టికులమ్మునం దెటులనైన మనేమి పురకృశమ్మునన్
బుట్టినదానికిన్ వగనఁ బూనిన లాభము గల్గఁబోదు తాఁ
గట్టినకర్మముల్ కుడువఁగాంచక తీఱునె? యిప్పుడేని యీ
గుట్టు నెఱింగి యొక్కరునిఁ గూడి దినమ్ములు పుచ్చఁజెల్లదే? 93

ఉ. ఒక్కనిఁగూడి కాఁపురము నొప్పుగఁ జేసెడి చానపొందులే
పక్కిని జారుఁడన్న దురపద్రవముల్ గలిగించు వింటి నీ
చక్కనిగాక సర్వజనసమ్మతమై మశిమాశమందుఁ జే
రెక్కుడి నగ్రజాతుఁడు హీనకులాంగన తోడి కూటముల్. 94

ఉ. కావున నన్ను జారగతిగాఁ గయికొందువయేని నొల్ల "భా
ర్యావిధిఁ జూచుకో" మ్మనుచు నప్పుడచెప్ప మదంబ, దానికి
న్నీవెటు లొప్పికొంటి? వదినేఁడిటులన్ గిన్కురింతె? మాకొలం
బేవగదైన మాసరణి యేవము నైంప దదెన్ని భంగులన్. 95

క. అనవుడు సుదారుఁ డిచ్చెలి, కను "నే లోకోక్తి నంటి నది నీకింతన్
మనము నలయించెనే? యే, మని భార్యగ నిన్నుఁ జూడననుకొంటి? చెలీ. 96

ఉ. చక్కఁదనమ్ములేదొ? గుణసంపద లేదొ? వయస్సులేదొ? బల్
తక్కులమారిగావొ? వివిధమ్ములు విద్దెలు నేరవో? నినున్
జిక్కనికాఁగిటన్ జనవు చేసినపిమ్మట భార్య గీర్యయున్
మక్కువ కానె? యేల యనుమానము? మానుము మానినీమణీ 97

ఉ. నమ్మవు గాని నీవు మదిపాటిన దాదిగ భార్యఁ జూడఁగా
నెమ్మది సమ్మతిం గనదు నేరము లూరక లోఁచు దానిపై
నెమ్మెయిఁ బూవు నీగుణములే కద! యింతకు గారణమ్ము, నీ
సొమ్మనుకొమ్ము నన్నను దిశుద్ధిగ మాటలు వేయు నేటికిన్. 98

గీ. విప్రులకు నాల్గుజాతుల వెలఁదులందుఁ, గలదు స్వాతంత్ర్య 'మది నేఁటి కలియుగమునఁ
గాదనుచుఁ గొందఱడ్డిరి గాని యింత, మాత్రమున, బోయెనే? పూర్వమతము సకియ.

సీ. బ్రాహ్మణుఁడై పుట్టి పరమచండాలితో సంసారియైన విశ్వాసి యొకఁడు
ముగుర ముల్ జంపినముండ మోపని గట్టికొని గృహస్థయిన ముకుణుఁ డొకండు
ఐకమత్యమున కియ్యవి ముప్పనుచుఁ గులాచారముల్ వదలినజాణ యొకఁడు
"పింగాళిచిప్పకు వెండిగిన్నెకు భేదమున్న దె!" యనినమొడి రొాగ్యుఁ డొకఁడు

తే. గీ. వీరలేకద! సభలలోఁ బెద్ద లిపుడు, మనకు మర్యాద వీర లేమని యొనర్ప
రింతకును దివ్యవంతున కెవనితోడ, నేమిపని? కలి యాతని నేమి సేయు?

చ. జనని గతించుదాఁక నొక చందమునన్ జననిమ్ము మీఁద ని
న్నను స్వగృహమ్మునం దిడుచు నూతనబుద్ధి యొకింతలేక నా

జన మదియెల్ల నీకు నుపచారము సల్పెదు నట్లొనర్తు న
న్ననియెడి వాఁడొకండు గలఁడా? మఱి తల్లి కొకింత జంకెదన్. 101

ఉ. దాఁపఁగ నేల? విన్ముమును తండ్రి గతించెడు వేళ ద్రవ్యమున్
నూపి ముదంబుతో "నిది త్రిశుద్ధిఁ నీ మరణంపువేళ నీ
వీపసివాని కిమ్ము చటు నించుకయేని వ్యయింప కంచులో
నోపినమాత్రముం గలిపి యుచ్చగతిన్ బొనరింపఁగాఁదగున్. 102

తే. గీ. యౌవనము ధనసంపద యాధిపత్య, మవల నవివేక మిత్యాది యందుఁ నొక్క
టొక్కటియె మానవుని నివియొకటునన్ని, యును బొసఁగ నేనిఁ జెప్ప నేముందు సాధ్వి!

చ. నవనవయౌవనుండయిన నందనుఁ డొప్పుగఁ గాంగి చల్లనా
రి వెలయు పాలభంగి నొకరీతికి వచ్చెడుదన్క బాగరూ
కవిధిని సర్వముం బయినిగాంచుచు ద్రవ్యము చేతి కీక పై
వ్యవహృతిశాలి యైనయపు డంతయు వానికిఁ జెందఁజేయుమీ. 104

చ. అని పలునీతులన్ దెలిపి యా పెరు సర్వము నప్పగించెఁ గా
వున మన కామెసమ్మతిని బూనక చెల్లదు దానఁ జేసి ని
న్ననిచెద వేఱుగాఁ, బిదప నోపిక పెట్టితివేని యెల్లగన్
బనిఁగొను దానవై మెలఁగవచ్చును బొచ్చెము లేనితీరునన్. 105

చ. అనవుడు నప్పెఁదియును నక్కట? యెందుల కింతసోద? నీ
జనని శతాబ్దముల్ సుఖవశమ్మున నుండెదుఁ గాక నీధనం
బును సుఖముండెఁగాక నను మోసముచేయక భార్యగాఁగఁ జే
కొను టది చాలు వచ్చెఁ బదివేటులు దానన నిక్కమింతయున్. 106

చ. ధనము గడించియుంచి యది తాము గతించెడివేళ నెవ్వరే
నినిఁ గొనిపోయిరే? జగతి నీతి యనీతియుఁ గీర్త్యకీర్తులున్
దనచనువేళ వెంటఁబడుఁ దక్కినదంతయు దూరదూరమై
పనుపడు దీనికేమి! పదివేళులు నీకృప గాంచఁగల్గితిన్. 107

ఉ. పిన్నటనాఁటనుండి కడఁ బెంకెతనమ్మున నుంటెకాని మా
కన్నెఁ బోలె నెల్లరకుఁ గాళ్ళకు మ్రొక్కెడి దానఁ గాను నా
మన్నికఁ బు సాగుటకు మూలమవై ననుఁ గొంటివీవు లే
కున్న మఱేమిలే ధనము, లుల్లము చల్లఁబడెన్ని జమ్ముగన్. 108

ఉ. ఏమనఁ! దెల్పు దాన విను మే మొద టీకొలమందుఁ బుట్ట లే
దే మనుజుండు నన్న నెనొ యెవ్వతె తల్లియు యే నెఱుంగ న
న్నే మెయిఁ దాను గన్నదెనొ! యిట్టిది పెంచియుఁ బెద్దఁ జేసి బల్
క్షేమము లొల్లి పేర్పఁ! గులనీతికిఁ దావలమై చెలంగఁగన్. 109

క. అనీతులు నామది కిం, తేనిం జొరబాఱ వేగఁ తిన్నేర్చును! చి
త్రైక నెఁగడనిపక్షికి. భా, పానిఁయుతి నేర్పఁ, గులమ చను ముఖ్యంబై 110

క. సంగీతము సాహిత్యమ్ముం గొమరగు నభినయమ్ము మగుదల కెల్లన్
సంగతములగుట నాకుఁ బొ,సంగున్ దగుపాటిపజ్జ జగదీశుకృపన్. 111

ఉ. ఇంతవు నాకొలమ్ము మొద లెయ్యదియో విననైతిఁ దల్లితోఁ
బంతము పట్టికోరినను "బ్రాహ్మణకన్య" వటందుఁ బల్కె నే
వింతవిధమ్మునన్నను వివేకవిహీన మదంబు గాంచి ని
శ్చింత మెయిన్ ద్యజించెనొ యిసీ! పశుపుంగొల మాశ్రయించితిన్. 112

ఉ. కోపమువచ్చు మీ కనుచుఁ గొంకక పల్కెద మీకొలమ్మునం
దేపగుచున్న దీయధమవృత్తి యదేమనఁ! బెద్దవృద్ధు తా
నేపసిపాపనో ధనమునిచ్చి కొనున్ గను నంత మృత్యు, వా
పాపిని మమ్ముఁ బోటుల నపారముగాఁగని యిట్లొనర్చెడిన్. 113

శా. పోనీ స్త్రీలు పునర్వివాహమునకున్ బోరాని వాదింతు వి
జ్ఞానుల్ పండితు లేమిపాప మొ! ధనాశన్ గూఁతు వృద్ధాత్ముఁడౌ
వానిన్ జేర్చునపాతకుఁ గూడ దన రవ్వాఁడిచ్చు నన్నొందరా
లానందమ్ముమెయిన్ భుజింతు రిది యన్యాయమ్ము గాదందునే. 114

శా. కన్యావిక్రియ మాఁగలేని యలవిజ్ఞానుల్ మరీటుంచుఁ దా
మన్యాయమ్ముగ స్త్రీ పునఃపరిణయవ్యాపార మాపంగ వే
డ్కన్ యోజింతురు రెండునుం దగనివే కాఁబట్టి యందొక్కటిన్
మాన్యత్వమ్ము మఱొక్కటిన్ దొసఁగదే మాడ్కిన్ బొసంగింతురో. 115

మ. పతితోఁ గొండొకకాలమున్ సుఖములన్ బ్రాపించి పై వాఁడువో
వుతటిన్ గుట్టివిరక్తిమై సకలమౌ భోగమ్ములన్ వీడి పో

డితలఁ దాల్చి యతిస్థితిఁ గనుట పాటింపక దగుఁ గాని చి
న్నతనమ్మునందున నాలుగేసులపుడే వా! యిట్టివైరాగ్యముల్. 116

ఉ. అట్టివయస్సునన్ విధవయై యది యింటికెఱుంగనప్పు డా
బొట్టెను గాంచి కొందఱు "టిది పూర్వఘనం బిటు పెట్టెఁబట్టె" నం
చెట్టులొ పల్కరుక్ మఱి యడే పయి నొక్కనిఁ గట్టుకొన్న నాఁ
డిట్టులు పల్కరాదె? యవు డెక్కడికేగెఁ బురాకృతం బహో! 117

తే. గీ. స్త్రీపునఃపరిణయములు సేయవలయు, నందుఁ దర్కింపఁగా నియ్యబలలైన
బాలవిధవలపట్లనా! పండితులకుఁ, గల్గుపాండిత్యమెల్లఁ జక్కఁగనడచుట. 118

శా. సుజన్ మొక్కరు కాళ్ళునేఁగఁ గడుగర్ శ్రావం బటుండంగ లో
నం "జంకర్ మన మిట్టులుంటి మిది యంతర్వాణి లీక్షించిరే
నిం జాలన్ వెలియౌ' నటంచు నొకరేనిన్ వారి వారింపరి
క్కాంజాక్షుల్ శమధర్మశాస్త్రములకున్ గన్పట్టి రెప్పట్టునన్. 119

ఉ. మాలల నంటుకోనిజనమాన్యులు, శూద్రులు చేసి తెచ్చు భ
క్ష్యాలు భుజింపనట్టి గుణగణ్యులు, మీకులమందు నేఁడు లే
రీలలి సంచరించు ఘనులెల్లరుఁ బంక్తికి నర్హులై పతుల్
గూలఁగఁ బెండ్లిచేసికొను కోమలు లెట్టు లనర్హ లౌదురో? 120

శా. ఆయాసూక్ష్మమున బండితుల్ గలుగగా! యందెందు విద్యాధ తే
మీ! యేర్పాటుగ నుండిరే? యుచట లేరే? దుర్కలున్ మాలలున్
నీ! యీయెల్లర కందు వేనముయున్ జెప్పంగఁ దా మొప్ప వి
ద్యాయత్తుల్ కులవంతులై విధవ పెండ్లాడన్ గులంబూడెనే! 121

ఉ. కావున నేను నీపిదప కాలమునందలి విప్రజాతిలోఁ
బావనురాలనై మెలఁగవచ్చుచు సంశయమేల? భార్యగా
నీవు పరిగ్రహించుటకు, నీతులు జాతులు పోనకట్టుకున్
గాకలెఁ బూర్వమం, దిపుడు గైకొనువా రెవ? రాప్రచారముల్ 122

తే. గీ. ఎవరుపూర్వపుటాచారమెఱుఁగువారొ, వారలకు శాస్త్రము తరవాదియు చటఁ
దక్కవారల కీజోలికపుల డెవ్వ, రేని నడిగిన నొకతె రిట్టులనిన. 123

ఉ. నాపుడు నవ్వి "యాకాలమునందుఁగల వైఖరు లిట్టులుండుటన్
నీ విటు లంటి తప్పిదమె? నీచులు మాన్యత గాంచఁబట్టి యీ
యీవిధు లిట్టు లయ్యె నిదియే మన పూర్వపుఁగాలమైనచోఁ
బావనపుం గొలమ్ము లిక పాడగునన్ బుధు లూరకుందురే? 124

మ. సరసంబౌఁగతిఁ బల్కితీవు జలదత్సన్యాస మన్నట్లు ని
ష్ఠురమౌ జవ్వనమందుఁ గాంతలకు నెట్టుల్ గూడు వైరాగ్య? మె
వ్వరికో జంకి యొనర్చు నేమములు నిల్వన్నేర్చునే? జన్మమే
బరువై తోఁచెను భర్తలేనిసతికిన్, బైమాట లింకేటికిన్. 125

మ. పతిపోవన్ బలవద్గతిన్ సతిని దగ్ధభర్త్రంగమందుంచి వే
చితి నంటించెడు ఘోరపుంగృతిని వాసిన్‌గట్టిపెట్టించి రే
మతిమంతుల్, తగవార లిట్ట్యబలలన్ "బాల్యమ్మునందే వివా
హితలం జేయఁగరా దటం" చనిన నీహీనస్థితుల్ తగ్గడిన్. 126

మ. "పదియేఁడుల్ చనుమీఁదఁ జేయుఁదగు నావై రెండు దాఁటంగ రా
దిదిపో! స్త్రీలకుఁ బెండ్లికిం జత" యటం చేర్పాటు గావించుచో
ముదికల్ వృద్ధులఁ బెండ్లియాడుటలు తప్పన్ దానిచేఁ దగ్గుఁ దాం
బదిపాళ్లిమురుపద్రవం, బదియు విద్వత్సమ్మతిన్ గాఁదగున్. 127

తే. గీ. ఈడువచ్చినకన్నియ నెవ్వఁడేని, వృద్ధునకు నమ్మఁజూప నెవ్విధిని సాగు?
నక్కటా! యెన్నివృత్తులో యువనినుండఁ, బంద తీవృత్తికతన జీవనముగొందుర్.

తే. గీ. అప్పదీక్షితు లొక్కప్ప డాత్మజాత, కిట్టి దురవస్థ గల్గఁ దానెఱుకఁ గల్గి
స్త్రీపునఃపరిణయములు సేయఁబూని, యుంత వెనుకదీసెనఁట తల్లియొప్పమనిక.

ఉ. అప్పటికాలమందు నెటులైనను నిప్పటివిప్రజాతికిన్
దప్పని దోఁచ దిప్పని, వృథాఁగని వారలగోడు వోసికో
నొప్పుటకన్నఁ బండితుల కొండొకదోసము లేదు పెక్కులౌ
తప్పుల కొప్పి యీయొకటి తాము సహింప రదేమి పాపమో! 130

తే. గీ. అరయఁగాలేక మిముటు వెలయాడ్రిటు బందుర్ గాని, యీ యుగమది నేఁటికాలమందు
ద్రవ్యమిడి పెండ్లియాడినధన్యతముల, భాగ్యలకు నెల్లఁ జెల్లఁగావచ్చుఁ గాదె.

ఉ. సాంకర్యమ్ము తటస్థమౌననుచు విశ్వస్తావివాహమ్ము వి
ద్యాంశుల్ పెద్దలు గాదటం చనిరి సత్యంబే, యిదొక్కండె యీ
పంకంబున్ ఘటియించునో యిటు లనన్ బాగౌఁ దనంతన్ జగం
బింకం బౌ నెడిపట్లు నీనియమ మిందెవ్వాఁడు పాటించెడిన్. 132

ఉ. భూతి మొగమ్మునం గలుగు పుణ్యుఁడు పొద్దుట స్నానసంధ్యలన్
జేతము జొన్ప వైదికపుఁ జెయ్వులమానిసి నూటి కొక్కఁడే
నీతఁడెఁ గానరాఁ డెపు డివేటికిఁ? బూర్వపుగాథ లేల? వి
ద్యాతిశయంబు మాని బుధు లందఱు దీనికి నొప్పరావొకో. 133

శా. వ్యాసాదుల్ ఋషులై నిజమ్ము లయి తద్వాక్యాల్ భవిష్యద్గతిన్
భాసన్ గుర్తిచ్చినరీతిఁ జెప్పు టది యున్ బోవండి యోరోరి! వీ
రే సార్వజ్ఞులు? వీరి కయ్యెడల లేనేలేదు విశ్వాస, మీ
యీ సత్తే నెటు లందు? భ్రష్టులగువారే తన్మతోద్ధారకుల్. 134

గీ. అనుచు నాయాయిగోష్ఠిని నతఁడు నదియుఁ, గొంతతడవు వాదమ్ము దమంతసల్పి
"మనకు నీగొడవేటికే? ఘనులు దీని, విందు" రని విరమించి పైవేడ్క దనర. 135

తే. గీ. తమకు ననుగుణమైన వర్తనలఁ గొంత, తడవుగడపి యామీఁద నుదారుఁ డింటి
కరిగి ప్రతిదిన మీరీతి నతిరహస్య, మైనగతి వానిపొందు దా నందుచుండె. 136

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం

బైన పాణిగృహీతయందుఁ

జతుర్థాశ్వాసము.



# పాణిగృహీత

## పంచమాశ్వాసము.



స

రసాంతఃకరణా సు
స్థిరగానాభరణ నిత్యచింతితభగవ
చ్చరణ కవితాదరణ సుధా
చిర వితరణ కీర్తికామ సీతారామా.

తే. గీ. అవధరింపు మనంతరం బట్లు కొంత, కాలము రహస్యవర్తన గలుగుమీఁద
వారినోటను మఱియు నవ్వారినోటఁ, దల్లి యెల్లసంగతి విని తల్లడిల్లి. 2

మ. అకటా! పుట్టినదోఁగముక్, మొదటనే యంతయ్యు గావించి పు
త్రికి యోగ్యం బొనరించి నా సనుముఁ జేతంబందు నూహించి యీ
సకలమ్ముల్ వెసఁ జేతికిచ్చితి నిసీ! చండాలుఁడై వీఁడు దు
ష్ప్రకృతిన్ మానఁడు సైఁచు టెట్టు లిఁక? నింటన్ వంటు లేనిప్పుడున్. 3

తే. గీ. వేదశాస్త్రమ్ములందు విశేషులైన, రాజనుతుల మెప్పించి మర్యాద మిగుల
నార్జనముచేసి రీయగ్రహారములను, బూర్వు లివి వీనికతమున బూడిఁగలియు. 4

వ. అని చింతించి యొక్కనాఁటి భోజనసమయమ్మున కొమరున కిట్లను.

శా. అన్నా! చిన్నతనమ్ము నుండియును సంధ్యావందనాసక్తి నీ
కెన్నంగాఁ గడునెక్కు డిప్పు డది తా నేమయ్యె? బ్రాహ్మణ్యపుం
జెన్నెని న్విడుచున్న దేమిగతి? నీచెయ్యాల్ వినన్ గోత్రమై
నన్నున్ గాల్చుచునున్న విట్టిపనులున్, న్యాయంబె? నీబోటికిన్. 5

చ. ఎఱిఁగియు నేరకో మొదట నేవపుఁ గార్యము స్వప్రీతుల్ సైఁ
దిరిగియు శుద్ధిఁబొందితి సతీమణి యా కులకాంత యుండ నె
బ్బెతికను మాని యప్పుడు పుడిత్తరి స త్తటి గుత్తగొందువా?
సిరిగల కొంపలున్ గలిగెఁ జేట్రిఁక మాటలు వేయు నేటికిన్. 6

ఉ. ఎవ్వరిఁ బంపినా వపటి కిచ్చెదుముండకునై, తనంతఁ దా
నెవ్వగ వచ్చె? "నెయ్యెడల కెంపుల కేగదో?" యంచు నెంచితిన్
అవ్వగదా? దినమ్మునన రాత్రి చెయ్యాలె? నీదు వర్తనల్
నవ్వరె? యొవ్వరేనియు, మనాయతఁ జేసినఁ గోఁతి యయ్యెనే? 7

క. ఏమేమి పగలు నాశౌచము, లామాదిగ ముండ కిడితి? హారారారా
సీ! మూర్ఖ! నిన్ను నీవయి, నేమియొనర్చినను బాప మించుక గలదే? 8

క. అని యేమేమో యొదలుడి, కినగతి కనుగుణముగాఁగఁ గెరలి పలికినఁ
దనుఁగాని యట్లువినియును, విననిగతిఁ జెవి నొకింత పెట్టక యతఁడున్. 9

ఆ. వె. భయముదీఱి పట్టుపగలును రేయును, దాని యింటనుంటఁ దక్క నన్య
మించుకయును లేక యిల్లాలి మాటయే, తలఁపకున్నఁ దల్లి తల్లడిల్లి. 10

గీ. 'అంతకంతకు మొరడయ్యె నహహా! వీఁడు, భార్యఁజూడఁడు వ్యవహారపక్షఁ గాంచఁ
డేమిగతి?' యని యొంచి తానేమి యనక, తగినవారిచేఁ జెప్పింపఁ దలఁచె నపుడు. 11

చ. అరమరలేక యింటివ్యవహారము లన్నియుఁ జక్కఁబెట్టుచున్
జిరమునఁనుండి స్వీయకృపాసేవక నాశ్రితుఁ డైనయోగ్యు నొ
క్కరుఁ గని "పుత్రు నీతిపరుఁగా నొనరింపు" మటన్న నాతఁ డు
ద్ధురమతి యొక్కనాఁ డతనితోఁ దగ మంతనమందు నిట్లనున్. 12

మ. కులవిధ్వంసకమైన కార్యము వివేకుల్ సేయఁగాఁ జోరుగా?
కులమన్నన్ గులమా? ద్విజాతి, యది చేకూఱన్ వశంబే? తమ
జ్జ్వలతన్ బ్రాగ్జనిభాగధేయమున సంపాదించి ప్రాయంపు దు
శ్చలముంబూని యధోగతిం బడు టిదే చందంబు? నీబోటికిన్. 13

ఉ. జన్మములన్ బొనర్చుటో! విశాలయశమ్ము గణించుటో! సదా
మన్ననకెక్క పండితుల మన్పుటో! చుట్టల నాదరించుటో!
విన్నఁదనమ్ము రాదె? సువివేకము పోదె? పురాకృతంపుభా
గ్యోన్నతి మన్నగాదె? యిటు లుంపుడుకత్తెలఁ గూడఁ బాడియే. 14

సీ. ముక్తికామినితోడ ముచ్చటించిరిగాని వెలవెలందులఁ గాంచి కులుకరైరి
ఉపనిషత్కాంతల నంచుకొనిరిగాని పశుపుత్రోత్తుల యాసఁ బాఱరైరి
సాహితీసతితోడ సరసమాడిరిగాని కులవిహీనలఁ జేరఁ దలఁప రైరి
కీర్తిభామినులకు మూర్తినిచ్చిరిగాని గుత్తలం జెలపోదు గోరరైరి;

తే. గీ. తరతరమ్ముల నుండి యుండదిక మికొ, యమ్మవారలు నేఁటికి లలనకతన
గోలుకను నీకు నిహపరమ్ములకు నొక్క, పెట్టఁ జెడఁదగినంత యిక్కట్టువచ్చె. 15

తే. గీ. ఇహమునం దట్టులుండ మీయింటిపూర్వు, లహహా! పరమున నేని వారాంగనాజ
నమ్మునకు సేవపడియె జన్మములు కోర్కె, యించుకయు లేక చేయుట యీవు వినవె?

ఉ. వైదికజాతిలోఁ బొడమి వారనికల్మికి నెల్లవై యని
ర్వేదమనమ్ముతో నిటు వివేకము దక్కి కళత్రయౌవన
శ్రీ దిగులొందఁ బాడువెలచేడియ నుంచెడి నిన్నుఁ బోటికిన్
మాదిరిసేయ నీ భువనమండలి నొండొక దుండఁ బోలునే? 17

మ. తిరుగుంబోతులు లేరె? వారిఁ గనియున్ ధీజాడ్యమే లేసియో
నరుఁ డెవ్వాఁ డిల వారకామినుల సౌందర్యమ్ము శాసించు? నీ
మరియా దెట్టిది? నేఁటి నీనడత కేమాన్యుండు లోఁగుండఁ? డో
ప్పరికింపందగునే? కనుంగొనుచు మీపాత్రపదు మాబోఁట్లకున్. 18

శా. దారిద్ర్యమ్ము జనించు, మై సిరి వృథా దైన్యమ్ముపాలౌ. సదా
చారం బాఱడియౌ, యశమ్ము మొదలే సన్న్యాసముం గాంచు, సం
సారం బగ్గిని వ్రగ్గు, నెల్లెడల నిస్సారత్వమే తోఁచు, నీ
వారస్త్రీసురతప్రశంస దగునే? వర్ధిల్లు సంసారికిన్. 19

కం. అని యేమేమో తానే, ర్చిన విధమున బోధసేయఁ జెవినిడక యతం
డనయము ననయంపుఁ బ్రవ, ర్తన మానఁడ, విటులమనము తరమే? త్రిప్పన్. 20

వ. ఇట్లు పలువురు సెప్పందొడఁగుటయు.

మ. ఇదిగాదంచు మనమ్మునం దలఁచి యయ్యేణాక్షితోఁ "గార్యమి
ట్టిది" యంచున్ దగఁ దెల్పి "మంచి" దనుచున్ డెందమ్ము పొంగార నొ
క్కదినం బాపురి వీడి యిర్వురును దుర్గాపట్టణం బేగుదెం
చి దిగుల్ దక్కి యటన్ వసించిరి ఘనశ్రీ మించు సౌధమ్మునన్. 21

ఉ. ఆపురి వీరిపూర్వులకు నాకరమౌటను దండ్రి యచ్చొటన్
గాఁపుర మాచరింపఁ దగఁ గట్టెను సౌధము, దానిలోనఁ దా
నీపురుషోత్తముండు వెలయుఁతి నొకర్తుక నుంచెఁ జచ్చెఁ గా
కాపురుషుండు సైపఁగలఁడా? యిది దాఁ గనులారఁ గాంచియున్. 22

ఉ. జ్ఞాతులుఁ దక్కు బంధుగులుఁ గాంచి "యహో! యిది యేమివింత? దు
ర్నీతి సహింపఁగా వశమె? నేరుపుమై మరలింత" మంచుఁ బో

నారఁడు వారి వచ్చుటకె యాజ్ఞనొసంగఁడు లజ్జ పుట్టదు
న్నే? తగుబంధువర్గ "హిహీహీ!" యని యాగ్రహమునంద నవ్వినన్. 23

ఉ. నవ్వుదు రెల్లవా రని మనమ్మునఁ దా నెఱుఁగండొ? యెక్కడా
అవ్వరు నాకరంబగుట పాత్రజ్ఞతయుం దగదం చెఱుంగఁడో?
యవ్వలఁగాక భార్యయను నంతయమున్నె పరుండు నై బుధుల్
పుత్రివ్వఁ బెట్టు దుశ్చరిత రోయని యాయన నేమనన్ దగున్. 24

శా. ఆనీటున్ వెడగుంబొజుంగు భవనమ్ముం దెల్లెసన్ గాయనీ
గానానూన రసమ్ములా! యభినయత్కాంతా వినోదమ్ములా!
సూవాస్త్రాగమ చర్చలా! మిగుల మెచ్చంగల్గఁ గాఁ జేయు లా
స్యాంగానుభవమ్ములా! యెలయు నీయీవేళ నా కెప్పుడున్. 25

ఉ. తిట్టఁగనిమ్ము తల్లి, సుదతీమణి భోజన మీద్వనిమ్ము, బల్
అట్టు జనింపనిమ్ము, ధనరాసులు గవ్వలుగాక చెల్లని,
మ్మట్టి యఖండ సౌఖ్యముల నందుచుఁ గష్టమెఱుంగనట్టి యా
పుట్టువుకన్న మిన్నయగు ముక్తి విరక్తి యొసంగ నేర్చునే? 26

శా. ఇచ్చున్ మద్దెలవిద్దెవారలకుఁ, దా నిచ్చున్ దగన్ బాడుచోఁ
బొచ్చెంబింతయు లేనిస్నేహితులకున్ బూఁబోండ్లకో యిచ్చు రా
నిచ్చున్ బంక్తికి నెంతమంది నయినన్, వీక్షింపఁ డావంత యే
నిచ్చన్ "ఖర్చిది యాయమింత" యని, వాఁ డేమింకఁ గానుండెనో? 27

ఉ. తల్లికిఁ జిక్కు దక్కె మది దక్క సమస్తము నాలుగేండ్లలో
డొల్లఁగఁజేసి యాపయిఁ గడున్ విలువై తగు నగ్రహారమున్
బల్లెలనిస్తు చాల కవి బంధకముంచి ఋణమ్ముఁ జేసి తాఁ
జెల్లఁగఁజేయుఁ బల్గలఁ జేతికి నెమ్మిక యింత యుండమిన్. 28

తే. గీ. తనయుపంక్తిని నన్నసత్రమ్ము జరుగఁ, గామసత్రమ్ము గణికలకడఁ జెలంగ
నయ్యవారునిఁ గొల్చుచు నెయ్యురెంద, ఱెందఱో సోమరులు వొల్తురెసక మెసఁగ. 29

ఉ. గాయన గాయనీమణు లొకానొక వేళను బాయకుండుటన్
జేయని చేరికై యతని చేతికి నాట వెలందివోలెఁ దా
హాయిగ జంత్రపుం గల యొయ్యార మెసంగఁ బొసంగి లోంగె నా
తీయఁదనంబు మెచ్చె నదీయక గాయసఁ డెట్టిఁడేని యున్. 30

తే. గీ. గాయకుఁడు వచ్చెనేని యక్కలికిఁ దాను, శిష్యభావమ్ము గైకొని చెలిమికలిమి
దానఁగలుగు విశేషముల్ దగినకొలఁది, నార్జనముచేసి కాని యయ్యనఘు విడదు 31

శా. దాతృత్వమ్మున మించియున్ మిగుల విద్యాసక్తి రాణించియున్
మాతృద్వేషము దారదూరగతియున్ మాన్యేతరుంగా నప
ఖ్యాతుంగాఁ దనుఁ జేయు నాథుఁ డది లోఁగాంచంగ లేకెప్డు లీ
లాతాత్పర్య పరీతుఁడై కడపుఁ గాలంబెల్ల హేలాగతిన్. 32

క. ఆకలికి వర్తనంబది, లోకుల కొకరీతినైన, లో నతనికిఁ ద
ద్వ్యాకులచిత్తుఁడగుట నా, హా కలిగించి "యది భార్యయగు" ననిపించెన్. 33

తే. గీ. "వీనితోనవ్వ మొన్న నవ్వానితోఁడ, నొక్కటేశయ్యఁ గూర్చుండె నూరకుంట
తగవె?"యని యెవ్వరేనియుఁ దనకుఁ జెప్ప, వినఁడు వినెనేని నమ్మఁడవ్విధము సుంత.

తే. గీ. గాఁగ రాఁ గట్టమాని యఖండనీతి, నాకరంబగు కులకాంత యట్లు నవ్వె
లంది వేషభాషాదుల నంది పైకి, సంచరించుఁ గులాచార సరణి విడిగి. 34

మ. ధనమందిచ్చును గాదుగాని యల కాంతారత్న మప్డప్డు నా
థునిఁ బాడన్ గవిగాయకుల్ చనుదు నందున్ వచ్చువానిన్ దనం
తన యేవేళనో వశ్యుఁ జేసికొని విత్తంబిచ్చు భర్తన్ జయిం
పనో నానాగను జిత్తమిచ్చి కడు సంభావించు గూఢస్థితిన్. 36

ఉ. ఆచెలి కేమిపాపమొకొ హాయిగఁ బాడెడి వానికన్నులన్
వాచవిగాఁ గవిత్వమొక వైఖరి సుంత రచించు వానిపైఁ
బూచు మనంబు, తాదృశుని పొందునకై మది నూఱుచుండు నా
లోచనసేయుఁ దన్మయత లోలవిలోచన సారెసారెకున్. 37

తే. గీ. రాజు సంతసమందిన గ్రామమిచ్చుఁ, బద్దమిడుఁ గవి బచ్చు దాపైచు ముష్టి
యెవనిమెచ్చునో కాంత యయ్యెమ్మె కాని, కతనుపట్టాభిషేకమ్ము నాచరించు. 38

ఉ. ఈగతి నప్పుడప్పుడు ప్రియుం డెవ్వరి మన్ననసేయుచుండుఁ దా
నాగజయాన వారికె యాత్మగతిత్వము వెల్లడించు నా
హా గదియెల్లవాల్లరిగఁ బై వినువారలు నవ్వుచుండ్రిహా!
భోగము దాని సంచుకొనఁబోలునె? యెంతటి పందకేనియున్. 39

ఉ. పోయినఁ బోవుఁగాక వెలబోటిపయిన్ మరులూని యెన్నఁడే
నీ యెడి యంతగాఁ దనదు నెగ్గు ఘటింపదు గాని యొక్కటే
“ఛీ” యని యుంచుకొన్న వెలినాయకన్నను హీనుఁ డన్నె? యే
ఛాయి సహింపనేర్చు నది యంతయు లోనర్చి యమర్చు సేవముల్. 40

మ. వ్యభిచారంబన వారకామినుల కావంతేని లజ్జాకరం
బభిమానఘ్నము నంచుఁ దోఁచ “దది గోప్యంబేల? గావింతు” ర
న్న! “భృతిన్ దెచ్చియొసంగు నాథుఁ డది విన్నన్ జీవనంబూడు” నం
చు భయానన్, గులకాంతరీతు లెటువచ్చున్? వాండ్రెట్లుంచినన్. 41

చ. సరసతగల్గువాఁడు గడుసంపద వొల్చెడివాఁడు నూతన
స్మరుఁడన నొప్పువాఁడు మదమత్తుఁడు నా విటుఁ డబ్బియున్ దరి
ద్రరతికి నాస చేయునఁట తా వెలయా, లిది స్త్రీలజాతికే
పరిచితి గన్నదోస మొకబానిసలన్ వెలిఁజేయ నేటికిన్. 42

మ. “ధనమేలా? సొగసేల? చక్కనికవిత్వం బెవ్వఁడే నేర్చు వా
నిని మెచ్చన్ దగు, మాటలాడఁ దగు వానిన్ బిల్చి, యవ్వానికిన్
జనవీయన్ దగు, వానితోడ విధిగా సఖ్యంబు గూర్పన్ దగున్
వనితాచిత్తహరుండు వాఁ” డనుచు నవ్వాయాక్షి లోనెంచెడిన్. 43

ఉ. ఏగతినైన మేటి సుకవీంద్రునిఁ గొల్చి కవిత్వ మల్లు నా
యాగతిఁ జక్కనేర్చికొను నాస దినమ్ముకు వృద్ధిఁబొందఁ నా
బోగము చాన ప్రాన్కుమెయిఁ బొత్తము లెల్లను జూచుచుండు నా
లోఁ గననయ్యె వాత్మకులలోలలలోచనలన్ గవిత్వముల్. 44

తే. గీ. రాధికాసాంత్వనమ్మును రచనఁజేసి, పేరుగనుముద్దుపళని తెల్వియును విజయ
నగరభూపాలుఁ డుంచిన నాతిచాటు, పద్యములు గాంచి యాకీర్తి వడయనెంచి. 45

మ. ప్రియునిన్ గాంచి కవిత్వపుం గరిమమున్ వేశ్య నోశ్లాఘించి త
ద్దయు నావిద్దియయందు నెమ్మనము శ్రద్ధాబద్ధమై యుంటఁ జె
ప్పఁగను “వారిం బిలిపించి నాకు నది చెప్పింపన్ వలె” న్నాఁగ నా
దయితుం డాప్రియురాలి కిట్టులను విద్యావిత్త్వ,మొప్పారఁగన్. 46

మ. కవనం బన్నను మాటలా? యదియుఁ జక్కన్ జెప్ప శాస్త్రాదికం
బవలోకింపవలెన్ బురాకృతపుఁ బుణ్యంబున్నఁ బైఁగాని యా

చవి శాస్త్రజ్ఞులకేనిఁ గల్గ దడిచూసక బొందఁగాఁ బోకు మే
వివరింపఁగలవా! యటుల గలుగు సాధ్యమ్ములెల్లఁ జెలీ. 47

సీ. చదువఁగావలె శబ్దశాస్త్రాదికమ్ములు వీక్షింపఁగావలె విద్యలెల్లఁ
జూడఁగావలె రాజచూడామణులసభల్ పొందఁగావలె మహాభోగములను
దిరుగఁగావలె దేశదేశాలవెంబడిఁ బడవలెఁ బడరానిపాటులెల్ల
వినఁగావలెను పూర్వవిద్వచ్చరిత్రముల్ దర్శింపవలెను ఛందఃపరిశ్రమ

తే. గీ. కవులుకవులన్న మాత్రాన కవులు గారు, ఎంతభారమ్ముగలదో కవీశ్వరులకుఁ
దెలిసికొంటివె! యిది యు విద్దెలను నెల్ల, ఫలము దీనికి యత్నించుట లఁతి యగు నె.

క. అన నదియిట్లను "సంతటి, ఘనమగు కష్టమ్ము దానఁ గలదేనియు నె
క్కొని యిపుడు కవిత సెప్పెడి, జనులకు మీ చెప్పినట్టి శక్తులు కలవే! 49

తే గీ. దేవభాషాకవిత్వమ్మిదికి విశేష, శాస్త్రవిజ్ఞాన మది యవసరముగాని
దేశభాషాకవిత్వవిధికి నిదేల? మెఱుఁగ నని చెప్పటో? నాకు నిది యెల్ల. 50

చ. ఎనుపటి నాటకమ్ములు ను మున్నటి మేటి ప్రబంధముల్ తెమం
గొనరుము నేఁటి కైసరుల కున్నవె? శాస్త్రపరిశ్రమమ్ము ల
య్యనఘుల సత్ప్రబంధముల నందఱు మెచ్చుటలేదె? ధారయుం
డినయెడఁ జెప్పనొప్పుగుఁ గడిందిగఁ గృత్తు లెన్నరేనియుఁ. 51

ఉ. నాపుఁడు నాతఁ డిట్టులను నాతిరో! నన్నయభట్టుఁ డాది వి
ద్యావిదులెల్ల నాంధ్రమున యుందుఁ గవిత్వము చెప్పి రొఁగదా!
గా విదితాత్మలొక్క తెలుంగా? తమ రభ్యసనం బొనర్చి, టా
దేవవచఃకలాపములు తెల్లము సేయవె? వారి పాండితిఁ. 52

గీ. తెలుఁగు తెలుఁగని యుద్దాన దిగు టెట్లాని, సంస్కృతమ్మనకన్నఁ గష్టమ్మెహెచ్చు
ఒక్కదానఁ బరిశ్రమమున్నఁ, జాలు దాని, సిద్ధానికో! రెంటఁ దగులవలయు.

ఉ. ఇప్పటి కైతగాం డ్రహహా! యింగిలిపీ సొకయింత నేర్చి పై
జెప్పెద రాంధ్రపుంగవుల, సీ! యవి పండితు లాదరింతురే?
తప్పులుతప్ప లక్ష్యతులు తంపుకు వెట్టుట కేనిఁ బూర్వమం
దొప్పిరె? వీరిఁ జూచి యొకొక్కొ యూరక నీమఁ జనించె వేదుఱుల్. 54

ఉ. తప్పని యెవ్వరేని విదితం బొనరించిన నొప్పుకొంటియే
తప్ప నదెందుకో యెఱుఁగు దార్ఢ్యము లేక ధార యూఁతగాఁ
జెప్పఁగ నొప్పునే? కవిత, చెప్పినచో నది మానికట్టుచే
యొప్పకుగాని పై విడుచు టొప్పునె? లజ్జ గట్టివారికిన్. 55

చ. ముకుపు మహాకవీంద్రులు సముజ్జ్వలభక్తి నొసర్చు కబ్బముల్
వినుతికి నెక్కఁగాని యవివేకుల కూఁతలు తాటియాకులం
దునెని నశియించె నోటఁబడు తుంపురులేనియు నిప్పు డచ్చుక
చ్చినకతనన్ జగాన విలసిల్లెకి మేటికృతుల్ నశించెడిన్. 56

ఉ. ధార వృథారసమ్ము నదు ధారయిడన్ మనసెట్టులొప్ప నో
వీరికి, నెక్కడేనియు వివేకులు గల్గిన వారిఁ గొల్చి త
త్సారము గుర్తెఱింగి తమ శాస్త్రము నేనియు నభ్యసించి యీ
పై రచియింపరాదొకో! ప్రబంధము, లేటికి వెఱ్ఱి యల్లికల్? 57

తే. గీ. కాలమహిమమ్ముగాని యేకాలమందు, వచనమురచించువారు కవనమునందుఁ
బేరుగాంచిరి, యెంతటి పేదతనము, వచ్చెఁ గవితాలతాంగి కిప్పారికతన. 58

క. అపశబ్దమ్ములతో వచ,నపుఁగవితలు మొదలుపెట్టి నారాయణ! మా
గ్ఘపుమనుజు లక్కటా! కవితపదమ్ములు విఱుగఁగొట్టెదరు నిర్దయులై

గీ. సంస్కృతాంధ్రమ్ములందు వచనకవనము, మున్ను రచియించువారలు నున్నవార
నర్ఘమగుపాండితియును బద్యకవనమ్ము, గలిగి విద్యావిదులమెప్పుగాంచువారు. 60

తే. గీ. పా లనుభవించువారు యవాగువొక్క, యపుడు ద్రావిన.రక్తులంచనరు వారి
సరికదా? వారి కదియు యశము ఘటించు, లేమి నది దరిద్రువారి కాలీలమెట్లు?

చ. ఇపు డిఁక నొక్కకర్మ మది యేమన? నేర్చినయంతలోనఁ గ
బ్బపుఁబను లాచరింప నది పండితులౌ గవులొప్పఁ జూచి "యీ
కవితము చెప్పనేల!" యని గాఢముగాఁ దల వాయఁ గొట్టి దా
నిపయి విమర్శనం బొకఁడు నింపును రంతరు నుమ్మడుంగుగన్. 52

తే. గీ. కుడిచికూర్చుండి యొక్కచో నడఁగియుండ,లేక నీకేల యీవెఱ్ఱి లేమ! యంత
వలసెనేనియు గానమందలి పరిశ్రమ, మమ్ము మెచ్చించి యాటఁ బేరుఁ గొమ్ము! కొమ్మ.

చ. అన నది యిట్లుపల్కు "నిజమాడితి రైనను గానవిద్యలోఁ
బని యది యెంతచేసినను బాడెడికీర్తియె తక్క నర్థముల్

గనెడితెఱం గొకింతయును గల్గదు దాని విధమ్ము లేనిచో
జననము వ్యర్థ మయ్యెడి పొసంగెడి విద్యయె విద్య యెమ్మెయిన్. 64

తే. గీ. అన్నివిద్యలఁ గలుగు సారాంశములును, గవితలో నలరారెడిఁ గానవచ్చుఁ
గాక రాదండ్రుఁగాక యక్కలదు యత్న, మునుబొనర్చెదఁ బ్రాప్తమెట్లునువృథయనో

క. పదకవిత మొదల నేర్చితి, నది సామది కంతకష్ట మనిపింపద యే
రోదవింపలేరు వచనము, గదియింపఁగ నెంతుఁ బద్యకవన మ్మింకన్. 66

క. "ముదివిటులు విధవలంజలు, పదకవిత" లటంచుఁ దిట్టె బహుశాస్త్రాంధ్ర రచ
య్యరయుఁడు శ్రీనాథుం డని, చదివితి నాపైఁ గోర్కె చదికిలఁబడియెన్.

తే. గీ. కడుపు చెక్కలుగా నవ్వఁగలుగు నకట!, వేణుగోపాలశతకమ్ము వింటిరికద ?
"ద్విపద కావ్యమ్ము ముదిలంజె దిడ్డిగంత" యనుచుఁబడఁదిట్టె నతని నేయమ్మగనెనో.

ఉ. కావున మీర లొక్క కవికంజభవున్ బిలిపించి యాయనన్
జీవనసేవనాదుల వశీకృతుఁగా నొనరించి నన్ను వి
ద్యావతిగా నొనర్చుటది తప్పదు మాకులమందు ముందు వి
ద్యావతు లాంధ్రపుం గవిత లల్లు యశస్విను లుండెఁగారె. 69

చ. అన మనమందు దానిదగు వాస్థవ సంతసమంది "మంచిదే"
యని కడు బుజ్జగించి తగుఁబట్టి కవీంద్రుని రాఁక గోరుచున్
దినములు పుచ్చుచుండ సుదతీమణి యొక్కెడఁ గోరి నాతనిన్
దనపురిఁ దత్సమేతముగఁ దాఁ జనఁగా నతఁ డొప్పె నందుకున్. 70

వ. పదపడి యప్పాణిగృహీతతో సపరివారమ్ముగ భాగధేయపురమ్ముచని యయ్యెడ నొ
క్క చక్కని బాముగుమాడుగున వసియించి నిరంతర సుఖమ్ముల నోలలాడుచు సం
గీతాది వినోదమ్ములఁ దేలు నవసరమ్మున. 71

చ. కన్నడసీమనుండి యొక గర్భదరిద్రుఁడు సుంతకైత దాఁ
బన్నఁగ నేర్చువాఁడు నొకపాటిగ గాన మెఱుంగువాఁడు రూ
పోన్నతి లేనివాఁడు వయసొప్పెడి వాఁ డొక బ్రాహ్మణుండు వ
చ్చె న్నిజశక్తిఁ జూపి సిరిఁ జెంద నుదారునిఁ జూచు వేడుకన్. 76

మ. పదపద్యమ్ములు కొన్ని చెప్పి తనదారిద్ర్యముం జూప "నే
మిది! నీవున్ గవనమ్ము చెప్పఁగలవా? యెందెందుఁ బాండిత్యము

న్నది?" యంచుఁ జురితపాండితీగరిమ నాయమాయావిశేషమ్ములన్
గదలింపన్ వెఱఁగంది యక్కవి రిక్తత్వమ్ము సూచించుచున్. 73

ఉ. స్కూలున నింగిలీషు నొక కొంత పఠించితిఁ దెల్గు దానితో
లీలగ నభ్యసించితిని లేమిమెయిన్ బయిరెండు సాగమిన్
జాల విచారమంది వెస ఛంద మొకించుక మాచి గానపుం
జాలది పూర్వమే కలిగి సాయమొనర్పఁ గతల్ రచించితిన్. 74

చ. హరికథ లల్లుచున్ గృహము నందలి రిక్తత వాపికొందు నేఁ
దిరిగెద దేశముల్, తగు సుధీమణి శిక్ష యొకింత లేమి సు
స్థిరగతిగాఁ గవిత్వ మది చెప్పఁగఁజాలఁ గటాక్షుమూఁచి మ
త్పరిచితమైన యట్టికతఁ బాడఁగ నాజ్ఞ యొసంగ వేఁడెదన్. 75

చ. అన జలజాక్షిఁ గాంచి "చెలియా! కనఁగొంటివె యాతనిన్? గుటుం
బనియతికై ధనాఢ్యులను వంచనసేయఁ గవిత్వమందుఁ దై
కొని వెతిమొత్తి పద్దెములుకొన్ని రచింపఁగఁ జొచ్చె నేను జె
ప్పినయదినొల్ల సత్యమనిపించుట కీతని రాఁక యుంగ్మలీ! 76

తే. గీ. ఎందులోఁ జేరకుండెడి హీనులెల్లఁ, గవులలోపల నిమ్యెడఁ గలియుచుండ్రి
ఎల్ల వర్ణమ్ములును గూడి యుంచుకంత, యంతరము లేక తురకలయందుఁ గలియు.

ఆ. వె. ఇంగిలీషు చదివి యొకవిత్వము సెప్ప, నేల? దానఁ జెప్పనేల? రాదు
ఉభయభ్రష్టు లిట్టులొనరింతు రీనాఁటఁ, గవుల కింక నేటి గౌరవంబు? 77

చ. అన సదయాంతరంగయయి యచ్చెలి పల్కె విశేషపాండితిన్
గను కవిచంద్రులిక్కరణిఁ గాఁ జనుదెంతురె? యెల్లచోట్ల కి
య్యనఘుని వాక్యమాధురి సహస్రముసేయఁగఁ జాలు మీరు న
చ్చిన కవి కాకపోయినను జెప్పఁగ నేర్చుఁ గవిత్వ మొప్పఁగన్. 78

చ. చదివెడిశైలి గానపుఁబసం దలరారుటఁ జేసి చక్కఁగా
మదికి ముదంబొసంగఁదగు మంజులమైన పదమ్ము లుంటఁ జేఁ
బొడలు రసంబు, నేరుపును బొల్చెడిఁ దప్పులకేమి? రక్తి సం
పద నడఁగింప నేర్చునె? చమత్కృతిమత్కృతియందు దోసముల్. 79

తే. గీ. దోషముల్ గల్గుఁగాక నిర్దోషమయ్యెగుఁ, గాక రసహీనకృతికన్న ఘనరసాప్సు
దంబగు కవిత్వమెంతు ముదంబొసంగు, నంకయోతుఁడయ్య బాబిల్లి హాయినిచ్చు.

శా. ఆమాటల్ విని యయ్యుదారుఁడును దా నంగీకృతిం బూని న
ర్మామాత్యాదులలోనఁ జేర్చుకొని యాయావేళఁ బాడించు చే
మేమో యల్లిక లల్లఁజేయుచును నాయేణాక్షియుం దాను ని
త్యామోదమ్మునఁ గాలముం గడపుచున్నంతన్ దుదిన్ వానికిన్. 72

చ. ఎఱు సొకయింత లేక చరియించుటచే నలకాంతపై మనం
బఱిగి యదెంత ద్రిప్పినను నట్టిటు తాఁ జలియింపదయ్యె న
త్తరుణికి నంతకున్ మునుపెఁ దన్మయమయ్యె వనోవికార, మా
యిరువుర లోపమేమి? యటు నీతనిదే యపరాధ మెమ్మెయిన్. 83

శా. దానిన్ భార్యగ నుంచుకొన్న యతఁ డంతస్థాపితన్ జేయుక
వ్వానిన్ వీనిని గోప్యమం దెఱుఁగ కవ్వామాక్షి కేళీగృహం
బేనిన్ జేర్చునె? యిట్టులైన నదిగాదే? సత్సతీరత్నమున్
మానం బూడ్చదె? నిత్యసంగ మది యానాస్మరంబు గల్పింపదే? 85

ఉ. "స్త్రీలకు గోప్యతాగరిమ చెప్పెడివారలు వెఱ్ఱు" లంచు మూ
ర్ఖాళి వచించు రిప్పుడిటు లంగనలన్ సభకెక్క నిచ్చి యా
మూలమునన్ జెడన్ మొగము మూసుక మిన్నక లోనఁ గుందు జ్ఞా
నాలసు లెందఱో యిల స్వయంరచితాగసు లుండి రక్కటా. 86

క. మును పూర్వు లెఱయనుభవ, మున నేసిరొ? కట్టుఁబాటు మూర్ఖులు దానిన్
గననేరక యిహీహీ! యనఁ, జను నే? తమకంతకన్న శక్తులు కలవే? 86

మ. కలుదారివన్ జన దంచుఁ జెప్పుటకునై కల్పించ్చు నా చెట్టు నా
కలుగూడదన్ గలుషమ్ము లంచుఁ దమవాక్కుల్ శాస్త్రముల్గా జగం
బులకున్ బోధ యొనర్చినట్టి సుమహాత్ముల్ కద్దు కైలాసమా
ఖులలన్ బోలఁగఁ జాలరో? వళి మొకో ఖండిప నక్కట్టులన్. 87

తే. గీ. తమరు విధిలేక చేసెడి తప్పులన్ని, కడుపున కటంచు వెలుఁగరే ఘనులు, వాని
నొప్పులని చెప్పనొప్పట యొక్క తప్పు, పూర్వులను దూఱుట్రెదియుఁ దప్పపయితప్పు.

తే. గీ. స్త్రీకి స్వాతంత్ర్యముండుట చెల్లదంచుఁ, జెప్పమను వంత పెత్తిరే? చెడికొలమ్మ
నెల్ల గంగను గల్పదే? యెఱుఁగనేర, కూరకయ శాస్త్రకర్తల మీఱఁగునే? 89

చ. బోగము దాని కింత తలపోయఁగ నేటికిఁ? గుక్క గోవునుం
గాఁగ నొనర్ప శక్యమె? యగాధము లేఁగి నంచెనేనియున్

స్త్రీగతు, లందులోఁ గఱకు చేయనివాఁడు ధవుండు గల్గఁ దా
యోగిని వంటిదైనఁ గను నొక్క క్షణమ్మున భోగినీగతిన్. 90

ఉ. ఆగతి నిర్వరున్ మరని కగ్గలమై మనమంద మ్రగ్గుచున్
సాగమిఁ బొక్కు "చింతకయుం సందగునే?" యని దేవు వేఁడుచున్
రాగమె రోగమై తగఁ గరమ్ము నలందుకుచుండి రంతలో
నాగజయాన సాహసము నందిఁ గృతార్థునిఁ జేసె నాతనిన్ 91

క. సామాన్యయయ్యుఁ బరకీయామాన్యతఁ గాంచి వాని నహమో నిశయో
యేమాలనో చరితార్థుఁ, గా మన్ననసేయు నతని కనుఁబ్రామి యొగిన్. 92

ఉ. నాయకు ప్రక్కలో నిమిడి నాతి యొటుల్ కనిపెట్టునో యతం
డాయతమైన నిద్రగను నయ్యెడ మెల్లనలేచి "రాదుగా?
ప్రేయసి" యంచు లో నొగులు ప్రేముడికాని ధయింగమ్ము చేరు నా
మాయలమారి, యవ్వ్యతివ మానస మేమిటు ధాత చేసెనో? 93

ఉ. రూపవిహీనుఁ డొక్కటుఁడు రూపసి, చీఁకటి వెల్గు, స్థండిలం
బే పఱి, పూరకు డుటయె యింపగు పల్కులు, ధూళి గంద, మే
చాపయునేని దుప్పటిగఁ జాన కృతార్థతఁ జెందు నేవల్
దోఁప వొకించుకేనియును దౌర్బల్యలికిన్ బ్రియుఁ డబ్బపట్టునన్. 94

మ. తనకై భార్యఁ బరిత్యజించెనఁట మాతన్ వీడి యవ్యాసమై
నను గాదంచును రోసెనంట యొకఁడై జ్ఞాత్యాదిబంధువ్రజం
బునకున్ దూరగుఁడై వెలింబడిన చొప్పున్ గాంచె నం టట్టివా
నిని దా నిట్టులొనర్ప న్యాయమగునే? నీచాత్మ కాకుండనన్. 95

ఉ. ఆతనియందుఁ బ్రేమ మొదలంతయు నశించియొ? కాదు; లేక ద్రి
వ్యాతిగమైన చిత్తమున నాశ జనించియొ? కాదు; రూపసం
ప్రీతియొ? కాదు; కొండొక కవిత్వ మదింతకుఁ దార్చునొక్కొ? దు
ర్జాతికిఁ గల్గు చంద మనరాదె? వికల్పము లిన్ని యేటికిన్. 96

మ. మగనిన్ రూపమునన్ ధనమ్మునను సమ్మానాతిరేకమ్మునన్
దగు విద్వత్తను దక్కు భంగులను మందప్రజ్ఞఁ గాఁ జేయు మేల్
సుగుణుల్ లేకయె యొక్క రీతి మెయి నించున్ మించు గాకుండ మే
టిగుటన్ గొల్చెనె? సాధ్వి, మానవతు లీశీవుల్ ప్రశంసింతురే? 97

ఉ. "పోఁడగు వీఁడు జారునికి వేఱొకఁ డా" నను నట్టి బుద్ధిఁ దూఁ
గాడెడి యందకత్తెఁ గొని యంతటఁ బోవక పంజరంబునన్
గ్రీడకుఁ గాక నుంచుగతి గేహమునం దిడ గేహినీగతుల్
పాడుకొలమ్ముకొమ్మలకుఁ బట్టునె? పైపయి నవ్వి యున్న వే? 98

మ. తనకున్ బ్రొద్దుట లేచుటాదిగ నిశీథంబైన యందాఁక న
మ్మను బిన్నమ్మలఁ బెద్దయమ్మలను బై మాతృష్వసృస్తోమమున్
దనతోఁబుట్టువులన్ మరుల్ గొలిపి విత్తమ్మిచ్చి భోగించు దు
ర్జనులన్ బట్టినదాది చూచు చెలికిన్ సాధ్వీత్వ మెట్లబ్బునో? 99

ఉ. ఉంచికొనంగ నేల? విల యూడిగపుం జెలులన్ జనుల్ నయో
దంచితమైన వర్తనకుఁ దార్పఁగ నేల? పయిన్ దదన్యథా
భ్యంచనలైన వారలకు నల్గఁగ నేల? కటా! భుజంగులన్
వంచనఁ జేసె ధాత్ర యొకపాటివివేకము గల్గఁజేయమిన్. 100

ఉ. ఆచెలి వానిఁ గూడి యిటు లాఱడిపోకలు వోవుచున్ బ్రియా
గోచరమైన ఫక్కి నటు కొన్ని దినమ్ములు పుచ్చె నంత నా
యీ చతురత్వమెల్లఁ దరి నెయ్యెడలన్ వసియించు నెయ్యురే
చూచి క్రమమ్ముగా "నిజము సు" మ్మది యంచుఁ దలంచి యొండొరుల్. 101

చ. కలసి యొకానొకప్డు "డిది గా దది యౌ" నని చర్చఁ జేసి "యీ
తులువ కిదేమి మూఁడెనొకో? తోఁచదు శుద్ధచరిత్రిఁ డిక్కటల్
తెలిసినఁ గోపదారి వెతదీరునె? చంపుట కాతఁ డక్కటా!
కలిగెనొకో? దురాత్మునకుఁ గాలము దగ్గఱి యిట్టి దుర్మతుల్. 102

ఉ. విప్రిలలో జనించియును వీరుఁ డితండు దుపాయులన్ గటా
ర్లప్రతిమానముల్ గృహమునం దెపుడున్ గనుమాటుసేయుఁ డా
ర్త్రిప్రదమంచు నెంచక పొరిన్ బొరి వేఁటకు నేగి కాన జం
తుప్రకరమ్ముఁ జంపుమన దుండగుఁ డిప్పుడు పుణ్ సహించునే? 103

చ. అనవుడు వేఱొకం డను "నవౌ! యతఁ డేమి యొనర్చు నట్టి చ
క్కనివిటుఁ దబ్బి సర్వవిధకామములున్ దన కున్న యప్పు డే
మని యిది గోరఁగావలయు నా యథమున్? వరియించినప్డు నా
డని వెనఁద్రోయువారు గలరా? యిది యాతని దోసమెట్లగున్? 104

తే. గీ. అక్కలికి భాగ్యరేఖ దానట్టిదగుటు, వెలికి రాకుండెఁ గాని యీ వెఱ్ఱితనపుఁ
బోఁడ యిటువంటి యతిథులఁ గూడ దింతఁ గొంద ఎఱుఁగదటే నిదిమనకేటికొఱ్ఱ !

చ. ఇది బయలెక్కెటే నిజమగునేనియు నాతనిఁ జంపనేల? య
మ్మదిత వధింపు టొప్పగును, మూర్ఖుఁడు గానియెడన్ వివేకసం
పదఁ గలిమిన్ జెలిన్ గృహము పాయఁగఁ జేయుటె మేటితెల్వి, ఈ
కక్క దినకమాను నే? తనదు గ్రాసము లేసుఖ మిచ్చి పెంచినన్. 106

చ. అనుకొన రాదుగాని మన మీతని దౌర్గ్యముఁ దిద్దనుండి, యే
మని వరియించె నంతకె సహాసత్రము చూచినయివ్వేలంది! నే
మని సతి వీడి యీతులువ కబ్బురపుం జనవిచ్చె! వీని ని
వ్వానిత యదెట్లు చేసినను వహ్వరె! మెచ్చఁగవచ్చు నెమ్మెయిన్. 107

సీ. తను దత్తఁ గాఁ గయికొనినతల్లి "యలోపాలో" యటంచును దుఃఖమొందుచుండ
తనకుఁ గన్నియ నిచ్చి ననఘులౌ న త్తమామలు లోన మలమల మఱుఁగుచుండ
తనుఁ గట్టికొన్న యా త్తమరాలు భాగ్య సంతతభావవృష్టి నేత్రములఁ గురియ
తనయుపక్ష్యపు టాసఁ దలకిందుగా వ్రేలు పితరులెల్ల నిరాశఁ బెట్టు దిట్ట

తే. గీ. సెందుకీ మదితొత్తుతో నిటుకు నటుకు, గాలిఁ దిరుగాడునౌకయుఁ గాక సారెఁ
బయనములొనర్పుచును దనవైనవన్ని గుఱుతెఱుఁగనివీనిఁ జేర్పఁగవలయు ?

ఉ. మానవులెన్ని? పూవులును మాళ్లు మకంద రువు తోఁటలెన్ని? పై
నీడు వచింప రాఁ దగని వెన్ని సిరుల్? తన కేమి వచ్చె న
వ్వీడు విడన్? విడెన్ సరియె వెక్కటి సూక్ష్మపురమ్ముఁ జేరుటన్
బూడిద! యేటికిప్పురినిఁ బోవలె వర్తన వద్దె కొంపలన్. 109

శా. ఆపప్పుల్ సేయుటతప్ప నే నెఱుఁగఁ డీకార్యేతరం బెల్లరున్
బప్పు గూడగ మిరింగుమండి రిపుడిప్పాపాత్ము రాలెటులేక
దప్పుం గాక యదృష్టమే యిదియు నీతం డింతలోనైనఁ దా
విప్పు స్నేత్రము, లున్నమట్టునయినన్ వీక్షించి రక్షించెడిన్. 110

చ. అన వదిభోః క్రిడిట్టులను "నాతని కెవ్వ రెఱుంగఁ జెప్ప వా
రివ్వఁ డెవరెన్ని చెప్పినను వీఁడిఁ, యంతటఁ బోక చెప్ప వా
నినె వెలిఁజేయ నట్టితని నేరుప దెట్టిదొ? యింత పెంకె వా
నినిఁ దన దానుఁ జేసికొని నిక్కడి నీగ్గెడి నెల్లవీఁగడిన్. 111

ఉ. ఎవ్వరి నేని లెక్కయిడ దెంతటి వానికి నేని మ్రొక్క దీ
గ్రొవ్వఁదపఁజాలదె మనసుగోరిక దీఱఁగ నందు నెంతు నేఁ
డివ్వఁగఁ జేసెదెంకఁ దగినదే యిది యైన మరేమి లాభమో?
నవ్వఁదగుం బొజుంగిది యథార్థమటంచుఁ దలంపఁ డింతయున్. 112

చ. అన మఱియొక్కఁ డిట్టులను "నా చెలికోలికిఁ బోవనేల? యా
యనకును దానికిన్ గలసె నాకిరి యుఁ, దప్పు లోనర్చుఁగాక యా
తని కవి యొప్పులేయగు వృథా మనకేటికిఁ గంతశోష! యే
మని "తగువార" మంచు నిది యాతనితోఁ గదియింప నేగుటో!. 113

క. ఆదివేశ్య, యితఁడు విటుఁడి, యేది తప్పొప్పులగు? భార్యలైన వనితలే
వదలంగనేరరీదు, ర్మదపుం జైనముల, నోరులమా కేమిటికిన్. 114

క. మన మేల నిమిత్తేయ్యము, గనవలయున్ దీఁ బాపగతి దాఁ గదు పైఁ
జముఁ దనయంతన యది యా, య్యామువునఁ దోడ్పడఁగరాదె? యంచెవలసిన్.

క. "ఏకత్తును నిప్పాడిన, నాకత్తుకు కాలు" నన్న మనవసరం బీ
పోకలు తగు యోగ్యులకున్, వాకుర్వ్వఁగ రాని, వింత వం బేమిటికిన్.

క. అని మిన్నునుండి రఁతటఁ, జనియెన్ మఱి కొన్ని నాళ్ళు, చయ్యన నక్కా
మినికి వినాశన కాల, మ్మును మూఁడెన్ దలఁచో కుబుద్ధి వొడమదే!

వ. ఇట్లు దినదినమ్మును గోరిక లీరికలెత్త నత్తలోదరి చిత్తమ్మున నుత్తలపాటు దక్కు యుక్కు కవి యక్కున కక్కున మక్కువఁ దక్కుచు సా. క్కుచు నున్నంత నొక్క నాఁటి రేయి యథాపూర్వమ్ముగ గానాదివినోదమ్ములఁ గాలహరణం బొనరించి నిశీథమ్మగుటయు. 118

చ. తన దయితుండుఁ దాను మఱిఁ దక్కిన నిద్దురఁ గొన్న తత్తరయున్.
బెనుగది సందునం దిమిడి వేఱుగ శయ్యలఁ బవ్వళించి యాం
డినచుపు డెప్పికానిపయి డొందము వాఱును సాహసించి "యీ
జను లెవరేఁ గందు" రని చాన మదిన్ దలపోయు కొప్పుగన్. 119

శా. అందెల్ చప్పుడు సేయు కుండుగతి నొయ్యారమ్ముగా లేచి దీ
పిం దెల్పొందెసి నీపచూర్చి గుటిచేఁ జేరిమాస్పదుం జూచి "వ
చ్చెం దన్వంగి" యటంచు మేల్కనిన యా చోరప్రియున్ జేరి యా
నందింపన్ దొడఁగెన్ దదీయ మగుడెందం బెంత పాపాత్మమో 120

ఉ. ఆలలిమొల్లఁ దాఁ గని యుదారుని స్త్ర్యాలయుఁ డెంతయేనియున్
బాలుఁడు దయ్యలోనఁ "దన బావకు నప్పకు దూర నాటకుల్
మూల మిదే" యటంచు దలపోసి "యి దేఁటిఁ బైఁ బోయినన్
మేలగు నప్ప" కంచు మితి మీఱిన రోషముఁ బోషుఁ దగన్. 121

ఉ. అల్లన లేచి దీపము గృహమ్మున వెల్గఁగఁ జేయునంత నా
వాల్లకపాణి మున్నె తనదౌ శయనీయముఁ జేరి "యింక నే
నెల్ల వచించినన్ వినుఁగు గాదిది నీనిక స్పష్టమాయె నీఁ
డల్లరి సేయుఁ" నంచు మది నల్లలనాడి దిటమ్ము గాంచియున్. 122

వ. ఉపాయమ్మునప్పిల్లవానిఁ బిలిచి మంతనమ్మగునెడయం దీసికొనిపోయి వెలవెలం బోవుచు దీనమ్మగు చందమ్మున మెల్లన నిట్లను. 178

ఉ. తమ్ముఁడ! నన్ను నప్పగ నెడం దలపోయుచు నేను పట్టి చం
దమ్మున నిన్నుఁ జూతు నొక తప్పొనరించితి నెట్లు గద్దెలోఁ
బమ్మిన పేర్మిఁ బెట్టికొని బావ యశమ్మిఁక రక్షచేసెదో
తమ్మవలెన్ స్వబుద్ధికృతకార్యము గాదిది మోస మయ్యెఁజూ!. 124

ఉ. ఈవిధి దాఁప నేమిగల? దే నొక నిద్దుర వోయి లేచి మీ
బావయటంచుఁ దగ్గఱితిఁ బాపి యతం డెటు లూహ చేసెనో
భావము మర్మకర్మముల పాలొనరింపఁగఁ జొచ్చె నింతయున్
జీవము నీదు హస్తమున జిక్కెఁ గృతాగసురాల నెమ్మియున్. 125

ఉ. పాపవు నిద్రమత్తు పొరఁబాటొనరించెను గాక లేనిచో
"రూపసి" యంచు వానిపయి రోషము జెందిచి స్వయంవరమ్ము గా
నాపగిదిన్ బయిన్ బడితినా? యిపు డేమన నేమి లాభమౌ?
దీపము కొంప దీసె. దన తేజము నంతకె పాయునేట్రికిన్. 126

మ. అది గాకన్ని విధాలఁ జెప్పినను నీ యామూఁక దానెందు కీ
గదిలోఁ జేర్చవలెన్? వినందు కద! యీకర్మమ్ము నేఁడబ్బె నాఁ
డుది యంచున్ మగవాఁ డటంచు నొకకట్టుంబాటు లేకున్న ని
గ్గది దక్కుంగలదే? యిఁ కేమనుచు నేఁ బ్రాణమ్ముతో నుందుదున్. 127

చ. అరమరలేమి సిగ్గుఁ డి యంతయుఁ దెల్పెద నంతలోన నే
నరసితిఁ గొన్ని సంగతుల "నాయన కా" రని, యప్పుడేని దు

శ్చరితుఁడు పోవనిమ్మనిన సమ్మతిఁ జెందఁగ వచ్చునా? "యిదే
దొరకెను సం" దటన్న గతి దుండగుఁ డయ్యె నిఁకేమి సేయుదున్? 128

చ. ఎవరిని బట్టినన్ విడువ రేను వచించితి నేనిఁ గోపముం
దవులు నొకప్డు చూచితివె? "ధర్మమె? భార్యను వీడు" టంచు నే
మివిలి వచించుచున్ గనిన మిక్కుటపున్ మారియాద, వేఱె చె
ప్పవలయునే? యెఱుంగనివి భావగుణమ్ములు నీకు నున్నవే? 129

ఉ. ఎన్ని విధాలఁ జెప్పినను నించుకయున్ విన రేమి సేతు? నా
మె న్ననుజామకన్నఁ గడుమేటిగఁ జూడకయున్న దుర్యశో
భ్యున్నతి మిమ్ముఁ బొందు టటులుండెఁగ నెల్లరు నంతకన్నను
న్న న్నను వార లన్న "నిను నాలుక గోసెద"నందుఁ బైఁ బడన్. 130

ఉ. దగ్గఱవాఁడు నీ పలుఁగు ద్రాగుడుఁబోతు లదేమి చెప్పిరో?
యగ్గిఁ దోసమబ్బినను సబ్బిఁగాక వచింపఁ జెల్లునే?
మగ్గి గృహమ్ములో నిముడుమానవతీతిలకంబుపట్ల నే
యెగ్గును, నెంతయుం దగదె? హీనులఁ గొంపలు గూల్చు కూళలన్. 131

చ. నిజమగు దోసమున్ గనియు నిందగృహస్థులు వృద్ధికాము లా
ర్యజనులు మాడకున్న యటు లక్కఁడ నే వఱతుక్ దురాత్ములో?
ప్రజలకు గీడు సేయుటయు వర్తనమాట నసత్యమేని దా
ని జగతి కెక్కఁజేయుదురు నీచులఁ జేర్చికొనంగఁ జెల్లునే? 132

ఉ. పుట్టెఁడు పేర్మితోఁ బతి! భోగున నాయమ యేడ్వ దారమున్
గట్టిన యాపెకన్న ననుఁ గాదనరాదె? యెటుల్ వచించినన్
బట్టినపట్టు వీడ రని భావ మెఱుంగుడు గాదె? యింతయున్
గట్టిఁడివైన మామె నటు గాటియవెట్టెడి నేమి సేయుదున్. 133

ఉ. ఆయమ మేటిదై గృహమునందు సమస్తము చక్కఁబెట్ట నే
పోయఁగ నాపెచాటున విహారపు భార్యగ నుండి యిర్వురన్
బాయక కొల్వఁగాఁ దలఁతు బానిసతొత్తులు భార్య లౌదురే!
"వేయిక నుండునే" యనుచు వీరపతివ్రత దాన నే మగున్. 134

చ. పతిరత యుండె నేనియును వారగభూమణి, దాని కెట్టులో
ప్రతిన చెసన్ గుటుంబినికి రా వటు దుస్థితు "లేమి" యంటివా?

పతి గల యింటి కిక్కఁగణి సంఘము చేరదు చేరనేని యు
న్నతగుణు లందు రం దవగుణమ్ముల కుప్పలు మప్పానర్పరే! 135

చ. తనుఁ బతియన్న భ్రాంతిమెయి దగ్గఱఁ జేరిన దుర్జనుండు గా
కునికిఁ బయిన్ బడన్ గలఁడె? యోగ్యుఁడు కొండొకనాతి యెట్టిదై
నను దనతల్లిగాఁ గనఁడె? న్యాయము దుర్మతి కేలతోఁచు? వె
వ్వారి నననేల? నాదు తలవ్రాఁతకు దుఃఖము నందఁగావలెన్. 136

చ. అని తనదైన తెల్వి యది యంతయు నట్టిపడన్ బతివ్రతాం
గనయును బోలె నీతులను గల్పనసేయుచు నప్పగారిపై
ననుమతి చూపు టాదిగల యాఁథ మంతయుఁ జూచి వాని నె
మ్మనము గరంగి నీగయి సమంజసమై కృప దాని కిట్లనన్. 137

ఆ. వె. ఇంత చెప్పనేల? యే నేటి కాయన, తోడఁ జెప్పవాఁడ? దుడుకు చెంద
వలదు, తెల్లవాఱ వచ్చె నిద్రింత ము, పోద మదిగొ చుక్క వొడిచె ననుచు. 138

తే. గీ. చేతిలోఁ జేయి వేయించి చెలియుఁ గొంత, యంతరంగమ్ము విశ్వాసమందఁబోయి
యుల్లఁ గనుమూసి నిద్రించునదియు పోలె, నభినయించుచునుండె నయ్యవసరమున. 139

ఉ. వాఁడును "దీన వేమగునొ? వామవిలోచన" కంచు లోన న
బ్బాఱుచు "దాఁటుకోఁ గలిగి నంతటిదే చెలి" యంచు మెచ్చుచున్
"గూడిక కంతరాయ మొనఁగూడునొకో" యని చింత నొందుచున్
వేడుకదక్క "యెప్పు డికఁ జేఁగునొకో!" యని యెంచుచుండఁగన్. 140

క. కాకమ్ము లఱచె మన్నే, "కోకో" యని కోళ్ళు గూసెఁ గోకమ్ములు ను
శ్రీకలిమి విఱ్ఱవీఁగె ది, వాకరుఁ డుదయించెఁ దెల్వి వఱలె జగమ్ముల్. 141

గద్యం.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం

బైన పాణిగృహీతయందుఁ

బంచమాశ్వాసము.



# పాణిగృహీత.

## షష్ఠాశ్వాసము.



అకపటహృదయాంతర్వి
ర్త్యకలితనాదస్వరూప దాతృకృతశ్రీ
ప్రకటితయశస్క భాభా,
సికలాజాలాభిరామ సీతారామా.

తే. గీ. అవధరింపు మనంతరం బయ్యుదారుఁ, డిచ్చుకేని యెఱుంగమి నెప్పటట్ల
నత్తలోదరితో మాటలాడఁడు గాని, యబల యొక్కింత మది సందియమున బలుకు.2

మ. తనమర్మం బది గుత్తెఱుంగు ననుచున్ దన్వంగి యబ్బాలునిన్
గన మాటాడఁ, దదగ్రిమందు మసలంగా సందియం బందు నూ
తనుఁడా పేర్మియుడికానిమోము గని తండ్రిన్ జెందు వేయేల? జీ
వనమే బర్వఁగ నెంచు మించినత్రపాభారమ్ము లెప్డొఁగదా. 3

వ. అట్టియెడ నుదారుం డచ్చెలిమిన్న చిన్నవోయినవిధమ్మున నున్న తెఱంగునఁ దన కన్నులు బన్నమ్ము గన్నయట్లు చింతించుచు సంతాపమ్మగ్గలమ్ముగ డగ్గఱఁ జేరి బుజ్జగించి యిట్లను. 4

క. తెలవాఱిన మొద తెప్పకు, కలికిరొ? గానమ్ము లేక కవితయు కృషిలో
మెలపు మఁ గలకలలాడెడి, తలఁ పేమిట్టి కీదినమునఁ దావగ చెడియెన్? 5

మ. కవి యేమయ్యెను? గైత యెం దడఁగె? జోకలో మాఱె నేమిటఁ తలఁ
జవి నానాఁటికి హెచ్చెనో? యుడిగెనో! చందాస్య? పద్యమ్ము లె
య్యేవియేనిన్ రచియించితే! చదువు మేదీ! చూత మం దెందు నె
ట్టివిశేషమ్ములు గల్గునో? వెతఁగు బోటీ! యింత వంతేటికిన్.

ఉ. వచ్చిననాఁటఁగోలె నిటు వామవిలోచన? యొక్కనాఁడునున్
ముచ్చట దక్కి యుండ వరమో మయి యీఁగనియంతవంతలోఁ
జొచ్చినదానిఁ బోలె నెటు చూచిన నొక్కవిధాన నుంటి వే
వొచ్చెము లేనిదాని కిటు పోలునె! నీకు ఃనీలకుంతలా. 7

క. చెప్పు మది యెట్టిదైనన్, దప్పక తీర్తు ననఁ దరుణి తడవికొనుచుఁ దాఁ
జెప్పఁదగిన దొం దుఃండమి, నప్పటికిన్ బొంకు హేతు వది కల్పించెన్. 8

క. కల్పించి మిగుల నేరుపు, జల్పనశక్తియును గల్గు సఖి గానఁ దగన్
బొల్పి యది యకృతమున ద్విగుల్పానినదుదియుఁ బోలెఁ గోమలి పలుకన్. 9

ఉ. మాటల కేమి లోపమగు? మానసవైఖరి మాటుఁ గానిచో
నేటికి దాఁచి పెట్టితిరి? యేఁ గనకుండఁగ నిన్న జా, బిదే
నాఁటను జూడ లే దొకటి నాకును మీకు రహస్య మున్నదే?
చాటొనరింపఁగాఁ దగని సంగతి నా కడఁ గంగ నేటికిన్? 10

క. మిము నమ్మి కాదె? నాము, ట్టములకు దవ్వైతినె తటక్రియలా? కటా!
క్రమముగ నను నేలొక టగు, క్రమమునఁ జూచెదరు తప్పుగలిగెనె? చెప్పుఁడీ. 11

క. మీయాజ్ఞ మీఱితినో? మీ, కాయాసకరమ్ము లైనయాయా కోర్కుల్
పాయక కోరితినో? న, న్నీయెడ ఱుసుఁ జూడ నేల? యే లాతినొకో? 12

ఆ. వె. మొదలనుండి నన్ను నెద నిట్లు భావింతు, రేని యింత చింత పూనకుండుఁ
బూవు లమ్మచోటఁ బుడక లేగతి నమ్మ, దాన? మీ రెఱుఁగని ధర్మమున్నె? 13

క. ఇఁక మిమ్ముఁ గొల్చు స్నేహితు, లకటా! నను గారవింతురా? వినరే? నా
యకుఁ డొకటి గొట్టినను మా, ధుకరపువాఁ డొకటి గొట్ట దొరఁకొనకున్నే? 14

ఉ. పేరిమి దప్పుచో నిచటఁ బెండెలు వట్టుక వ్రేల నేల? యిల్
చేరుదువా? యటన్న నది చెల్లదు పంజరమందుఁ గొన్ని నా
ళ్ళీరము దా వసించి పయి లేచి చనంగ స్వజాతి దానిపైఁ
గారము నూలుఁగాని తగు గారవమున్ బచరించి యేలునే? 15

క. కొలమునకున్ వెలి యయితిన్, బలవంతపు బ్రాహ్మణార్థవైఖరి మీకున్
జులుక నగు దాననైతిన్. దలవ్రాఁతకుఁ జింతసేయఁ దగదే? నాకున్. 16

క. అని బుడిబుడి దుఃఖమ్మునఁ, గనుఁగవ నశ్రువులు దొరఁగఁగా గద్గదని
స్వన మొలయ మాటలాడఁగ, నను వుపడని విధము దోఁప నది విరమింపన్. 17

చ. "ఇది యొక హేతువౌనె చెలి? యింతటివంతకు, దాన నేమి యయు
న్నది? యడుగంగ నేల? కనినంతన యేమనువాఁడ? జూడుమ
య్యది యటఁ బెట్టియున్న" దని యాతఁడు తెచ్చి యొసంగునంత న
మ్మదిత పఠింప దించుకయు మోమటు త్రిప్పదు వ్యాజమూర్తియై. 18

క. దాని కతఁ డెంతయేనియు, లోనొగిలి తదంగనాతిలోలుం డగుటన్
"మానిని? విను వినిచెద నీ, నా నేరము సైఁప" మనుచు నారంభించెన్. 19

క. శ్రీరస్తు చిరంజీవి యు, దారుసకున్ దల్లి శోభనావాప్తిగ నా
శీరాదిపూర్వకమ్ముగ, మీ జననీప్రేమమున వ్రాయుమే లే మనినన్? 20

మ. కనవా రేవ్వో? నీ వెఱుంగవు నినుం గన్నట్టులే పెంచి పె
ద్దను గాఁ జేసి గృహస్థుగా సలిపి సంతానాఢ్యుఁగాఁ జూడకే
చనె మీతండ్రి, యభాగ్యురాల నగుటన్ జాయాప్రజాదూరు నిన్
గన జీవించితి నేఁటి కీబ్రతుకు? ప్రాక్కర్మమ్ము నిందార్పవే! 21

క. కడచినదానిని పోరెదుఁ, దడవిన లాభమ్ము గలదె? దారము నీకున్
బడదయ్యెఁ బురాకృత మి, య్యెడ దా నిట్లుండె దాని కెవ్వరు కర్తల్. 22

క. "ధనమును వెచ్చించితి" వని, మనమున దిగులొందఁ గలరె? మనుమలు దీనిన్
దినఁగ, మనమూఁడుపోట్లుఁ, దినకుండునె? చాఁ జియుఁగఁ జదరయుఁగాదే! 23

క. చెప్పితిఁ జెప్పించితి నీ, యొప్పమియును దెలిసికొంటి నూఱటగన లే
కిప్పుడిఁక నొకటి వ్రాసెద, నప్పా! యిద్దానికైన ననుమతి గొనుమా?. 24

ఆ. వె వయసు కొద్ది యైనవాఁడవు గాన నీ,కిష్ట మైనకన్నె నేటి తెచ్చి
కొనుము పెండ్లి చేసి ధనమెల్ల మీ కిచ్చి, సంతసింతు మేము సతియుఁ గాంచి. 25

గీ. ఇంక నొకమాట భార్యయం దిష్టమింత, కయుండ లేదేని యీ పెండ్లిగాని సుఖసు
ఖాల మేమిట్లు లోప్పటుగా ననుమ్ము, గేస్తు వసు కెక్కరణిసైనఁ గీర్తికరము. 26

క నీయిష్ట మెట్టులేని స,తీయుతుఁడవు గమ్ము నీకుఁ దీపి గలుగు నా
రోయుటిద యొంటివా? యది, పాయనిదే మేము చెప్పవానవె యవటన్. 27

క. అని వినిపించిన విని యు, వ్వనజాక్షియు నతనిఁ జూచి "వసురుని గొమరున్
గొనములు గలసతి యుండఁగఁ, జను నే? నీ కిట్లు మమ్ముఁ జక్కన్ బెట్టన్. 28

తే గీ నీవు బాగుగనే యుండు నింద నాది, యొందు కీఱవ్వ? నీకు నే నెప్పుడేని
"భార్య వదలు" మటంచుఁ జెప్పుదుఁగదా! వి, వేకవంతు లెఱుంగని విధులు కలవె 29

క. అని తనమనమునఁ గలవిసు,వునవో యిచ్ఛకమొ కాని పొలఁతి తగుగతిన్
దనకున్ బోధించిన నా,తనిమనమును గొంతకొంత దారిన్ మరగెన్. 30

తే. గీ ఉత్తరమ్మును వినిచిన యువతి దానఁ, గొంతశాంతించినట్టుల కుటిలుఁ డతఁడు
తలఁచె నాజలజాక్షి యట్టులనె యభిన, యించె మదిమన్న తెఱఁగది యెఱుకఁబోవు. 31

క. ఆగతిఁ గొన్ని దినమ్ములు, నేగుటయును నప్పుడేని యింతిమనము దా
బాగుపడదయ్యె దానివి, రాగపుగతి గాంచి దాఁ గరము శంకితుఁడై. 32

ఆ. వె. ఒద్ద నుండువారి నొక్కొక్కరిని నల్ల,నల్ల నడుగుటయును నంద ఱెఱిఁగి
యున్నవార లైన నూరకయుండి రె, వ్వరికి వలయు నిట్టిపాడు గొడవ. 33

క. స్యాలకుని నట్టి యమగుమ్మ, బాలకుఁ డగుకతనఁ దగినవనుపుత్ర బొంకన్
జాలక యున్నది యున్నటు, లాలలనయుచేష్టయెల్ల నతనికిఁ జెప్పెన్. 34

క. దానివయి దానిదగుకవి, తానూ నాసక్తియును సహాయము గా "నీ
మానస తో త్రిటు చేయుట, యే నిజ" మని కనలు గదుర నిటు లెద నెంచెన్. 35

క. ఎవఁడేనిఁ జెప్పినను నమ్మ వశము గా దించుకయును మాయ యెఱుఁగఁ డే
య్యవిదనె యక్కఁగ గను పీ, నివివ ముయున దోసమెట్లు నేనూహింతున్. 36

క. అని వచ్చెడికోపమ్మున, దనమది మును పాఁతుకొన్న తాత్పర్యము గ్రీ
ర్కొన గ్రింగఁ గొన్ని నిముసము, లనయము నిలికృతివిమూఢుఁడై మాఱెస్పడియెన్

ఆ. వె. ఎనిమిదేండ్లనుండి యేకశరీరమై, యున్నవన్నె లాఁడి యొక్కయింత
లోన శత్రువయ్యె, లో మాఱ వెనుకటి, చిన్నె లెన్నఁబడునె? చేటుదక్క. 38.

క. అట్లు మాఱెస్పడి యతం డొక్కింతతడవునకుఁ దెలిసి

తే. గీ. ఎఱుఁగ కుంటిని గాని యీహీనబుద్ధి, యెల్లపుడు నిట్టిదే దీనియెడల నిట్టి
చపలభావమ్ము గలదని సారె నొక్క, చెప్పఁడే? మొట్టమొదట లొక్కస్నేహితుఁడు

మ. అకటా! చిన్నటినాఁటనుండియును నభ్యాసక్తతన్ సూతగా
నక పేర్మిన్ భయభక్తులన్ గొలుము ధన్యన్ మాఱ్ఱ నిల్లాలి నా
రక యీతొత్తువలన్ దగులొక్కని విచారమ్మేదు మున్నంగఁ జే
యుమచేష్టన్ దగినట్లొనర్చె నిదియే యుక్తంబు దానెమ్మెయిన్. 40

చ. ధనమును వమ్మొనర్చితిని దల్లికిదవ్వయి తాఱుఁబోతులం
దును నొకపద్ధు నైకొని యధోగతికిన్ దగువాఁడ నైతి నీ
యనుచితకృత్య మంతయును నక్కట! యిప్పుడు గాదె? హేతు వే
మనుకొన నేమి లాభ మగు? నన్నియు నింతకుఁ నేఁడు బూత్రిగన్. 41

ఆ. వె. ఏ నెఱుంగనైతిఁ గాని యీదుష్టురా, లింత కుతమఁది నిచటఁ జూచి
"ఇంతకన్న బుద్ధిహీనుఁడు లేఁ"డను, యశము నాకు జగతి కంపెనొక్క. 42

క. అని పశ్చాత్తాపమ్మున, గని హితులకుఁ జెప్ప రండగర్భ మగుటఁ గా
దని యటునిటును దోఁపక, తనలోఁ దా నిమిడి యవ్యాహారుం డుండన్ 43

చ. క్రిమమునఁ గొంతకఁ దక్క యలకంజవిలోచన "నాథుస్యాలకుం
డమలినచిత్తుఁడే" యనుచు నాత్మమదం బొకయింత గాంచుచున్

"కరమణుఁడు తన్నుఁ జూచుటకు రాఁ డెటు తక్కెనొకో!" యంచుఁ గేళిస
ద్మము వీడి వచ్చె నచ్చెలి యమూరుఁడు చింతిలుచున్నచోటికిన్. 43

ఉ. వచ్చినగాని రాత్రి యొకవైఖరి స్వప్నము గాంచి యుంటచే
నచ్చపలాక్షి యందుఁ గల యాత్మస్మృతిన్ దలపోసి "నీకు ఱమ్మా
వచ్చుటఁ గాని యేమొ విధి యెట్లొనరించునొ" యంచు సంశయం
బిచ్చఁ జరింప నగ్రమున నే యొక భంగిని నిల్చె రిత్తగన్. 44

చ. నిలిచినయంత నచ్చెలికి నేత్రము గాఁ జలియించె దానికిం
దలరక దక్షిణంపునయనంబగుటన్ మఱికొంత సందియం
బొలయఁగ "నారకే యిటుల నుండుటయున్ గల" దంచు దాని లో
దలఁపుచు లేనితోస మలతోయ్యలి దాఁకుచు నట్ల యుండఁగన్. 45

ఉ. ఎవ్వఁడు దేనిగాలి యొకయించుక సోఁకినఁ ద్రిళ్ళు చూచు నిం
కెవ్వఁడు చేరరాక కెరు రేగి యెడన్ దమిఁ గౌఁగిలించు ని
కెవ్వఁడు భార మంచెఱుఁగ కెప్పటి కంకమునందు నిల్పు వాఁ
డవ్వగలాఁడి వచ్చుటను హాత్మ దలంచఁడు వాఁడు దగ్గ్యపన్. 46

క. ఆటు నిలువంబడి చింతా,జటిల మృగునతనిచిత్తసరణిన్ గల దే
మిట్టి యొకో? యిటు లింతట్రిలో, మటుమటు యీతనికిఁ గల్గు ఖర్మ మదేమో? 47

క. స్వామికుఁడు తంపి వెట్టెనొ?, బాలకుఁ డతఁ డేటి కట్టి పని యొసరించున్
గూళ లెవరేని వానికి, నీల యిడి వదింపఁ జేసి రేమో? మరలన్. 48

ఉ. ఏ నొనరించుచేష్ట యది యీచినవాఁ డొకరుండె కాక యీ
వానరసేన కెల్లెఱుంగ వచ్చు? నెఱుంగక యేమి పిల్లి దా
గానని కన్నులన్ భయముఁ గంపము నొందుచుఁ బాలు ద్రావ నే
ర్గానరె! కొంపఁ దీయుటకుఁ గాఁ బ్రయతించిరొ యేమొ? యీసునన్. 49

చ. ఎటు దొరకున్? ఘనాంగనకు నిట్టికొలమ్ము వయస్సు రూపము
గ్రట్టిదము పేర్మి గూర్మి గలకాముకుఁ, డేట్టికిఁ బోతి? వానితోఁ
గుట్టిలుఁడు వానికైత యది గొంతుక గోసె, వరిద్రుఁ డేటి కి
న్నట్టి కరదెంచెఁ గూళవిధి యొద్దను లెవ్వరి నెట్లు సేయునే! 50

ఉ. హాయిగఁ బద్దెముల్ చదివినంతటు వానికిఁ జిక్కెఁ గాని యీ
కోయనికోఁతి దక్కఁ దెలిసెనో గనుక్కిఁ చెనె? పాపబుద్ధి. ఛీ!

ఛీ! యని యీతఁ డింక నెడఁ జేసినఁ "జాలును" నంచు జీవమున్
గోయక యెట్టులుండు? సరిగోయుఁ డదల్ ననుఁ జూచి నవ్వఁగన్. 51

ఉ. ఎంతటిభాగ్యమే? యనుచు నెంతయదృష్టమొ? యంచు నెంతబల్
వింతలొ? యంచు నెంతవార లెంతలఁ బుణె యంచు ముక్కుపై
నింతులు కేలు పెట్టికొని యెల్లపుడు న్నుతియించు నాకు నీ
వంతయు నిక్కమైనను రవంతయుఁ గూడవు జీవనస్థితుల్. 52

గీ. మఱుగు కాలువజాతిలోఁ బొడముపలుగు, లేదఁ సంసారిజులతోఁ బ్రవలేద? తక్క
కిందు నే? నేయి"యని మోము నెదుట నెల్ల, వారు నిందింప బ్రతికినభాగ్యమేమి. 53

చ. పొడమితి నేకొలమ్మునన్ పొందితి మిక్కుటమైనభోగముల్
గడపితిఁ గాల మెల్ల వృథ గాక సుఖమ్ముల కెల్లయై చనన్
దొడిగితిఁ గట్టితిన్ గులముతొయ్యలు లెల్ల సెబా సనంగ ని
త్యేడ నిఁక నేమియైన నగు నెంతకు శాశ్వత మీశరీరముల్. 54

ఉ. ఐనను నాత్మవాత్య ఘదియంత శుభపరిద మంచు నెంచమిన్
నానెఱజాణచెయ్యముల నాయఁడఁ గా డని నమ్మఁ జేసి నా
పై నెవ రిట్టు చెప్పిరో? కృపారహితుల్ కపటాత్ము, లిప్పుడ
క్కాని దురాత్ములన్ విడలఁగా నొనరించెదఁ గాక యం చొగిన్. 55

ఉ. చిత్రము గట్టి చేసికొని చిన్నె లెఱింగిఁజాణ గాన లో
నుత్తలపాటు లేనిచెలియుం బలె డగ్గఱఁ జేరి వెన్కయై
యుత్తలి నాకుఁబోడి కను లల్లనఁ జేతుల మూసె నంతలోఁ
దత్తరమంది "యెవ్వ" రని తక్కగకంజసమాగమమ్మునన్. 56

క. మెత్తవడెడి విత్తమ్మును నొత్తిగిలన్ జేసి, చేతు లాక్కింతన దా
నెత్తి వెలిఁ జిమ్మ "సీ!సీ!, తొత్తా! నను ముట్టఁ బోకు తొలఁగు" మటన్నన్. 57

ఆ. వె. డిల్లవోయి తనదు డెందమ్ము పతియులై, కట్టు దప్పఁ "గలలు కల్ల గావు
కోవనములను గాకసత్యముల్ నిజ"మని, మనసు మరల ధైర్యమునఁ దోనిపి. 58

క. "పరకీయచందమునకున్, జొరబడితిం గాని సుంతసౌమ్ముగకై క
క్కురితిం బడనుగదా? యే, తరుణులకున్ లేని విట్టి దశ" లని తగచున్. 59

వ. అని త్రాడువాటి యవ్వారిజాక్షి చురచురఁ జూచుచు. 60

ఉ. ఎప్పుడు లేనిరీతి యిది యెట్టిది? యింతటితిట్టు తిట్టి, నే
త ప్పాచరించితిన్?, వెనుక దారి యదెల్లను దప్పె నింతలో
నెప్పలుగుల్ మఱేమి వచియించిరి? నవ్వుల కిట్టు లాడుటో?
చప్పుడు గాక యుండ నను సాగఁగఁ ద్రోలు నుపాయమో? కదా. 21

తే. గీ. భార్యఁ బాలింపుమని నిన్న వచ్చియున్న, యంత్యరమ్మునఁ జిగురున నున్న యట్టి
తల్లిమాటను బాటింపఁ దలఁచుటొక్కొ? యే నెచటికేగుదాన? నిన్నిపుడు విడిచి.

తే. గీ. వయసు దార దోసి వచ్చినయప్పటి, నుండి నిన్నుఁ గొల్చి యొకటనైన
భేద మిత లేని పెన్మిమెలంగిన, దాన నెటుల నిపుడు తలఁగుదాన? 68

తే. గీ. వంటబ్రాహ్మణుతోఁ గాని బట్టుబుతుకు, వానితోఁగాని బప్రౌఢువానితోడఁ
గాని లోకమ్ములోపాటు గానొకింత, కలికితనొ యెంతకెంత మీకలికిపాటు?.64

ఉ. ఇంతకుఁ దప్పు లేనను నికృష్టగతిన్ జనునే? తిరస్కృత
స్వాంత నొనర్చు, నొక్కయెడ నచ్చటయున్ గలుగన్ దొసంగు; ర
హ్వాంత విచారణల్ వలయునా? "యిదె దున్నదు దూడ పుట్టె" న
న్నంతన "పట్టుదె" మ్మనఁగ నౌనె? భవాదృశుఁ డైనమేటికిన్. 65

చ. అని నిలుపోప రామి నయనాంచలసంచలదశ్రుమాలికల్
వెనఁగొని గద్గదస్వనము పేరి వచస్స్థితి దప్పఁ జేయ నా
తనిపదముల్ శిరమ్మునకుఁ దాకఁగ నొయ్యన వ్రాలి యేడ్చె న
క్కనకనిభాంగి యాతనికిఁ గంటఁ దడిన్ జనియింపఁ జేయుచున్. 66

క. విరిసెడికోపము పోరిఁబోరిఁ, బురికొనఁగాఁ జేసికొని నభ్రంశమగతి ద
త్తరపాటు దక్కియుంచుక, తరలి మరలఁ బల్కె నయ్యవారుఁడు దయతోన్. 67

క. ఎక్కడి నీ వెక్కడినే, నెక్కడినమ్మకలు? వలపు లెక్కడ? కొన్నా
ళ్లక్కఱ పడి తిరిగితి మ్యాదకున్కవ లన్నియును నాఁటిమాటలు చెలియా! 58

క. అప్పటినీవును వేఱే, యప్పటియానేను వేఱె యప్పటికాలం
బిప్పుడు రమ్మన వచ్చునె? యిప్పటికిన్ దగినరీతు లిప్పుడు వచ్చున్. 69

ఉ. రొక్కము లేక కాదు నిను రోసియుఁ గాదు మఱొక్కలేమకున్
దక్కియుఁ గాదు చెప్పెద యథార్థపుసంగతి చిత్తశాంతిలోఁ
గుక్కలరీతి నొక్కవెలకోమలికై పలుమంది చేరినన్
జిక్కు లనేకముల్ గలుగు ఛీ! యసహించి విరక్తి చెందితిన్. 71

క. అని యటు నిలువక బాలిక, చని వేఱొక్కెడకుఁ గొంత శాంతించియు న
వ్వనితన్ సుకవిన్ సహితమ్ముగ నె యిలువెడలింప నెంచి కఱకువాదముగన్ 72

ఆ. వె. తగినమిత్రు నొకని దగ్గఱఁగాఁ బిల్చి, కార్య మిట్టిదని యనఁగా నతండు
సంశయించి పిదపఁ జాన యున్నెడ కేగి, యిట్టులనియెఁ జిన్నయెలుఁగు దోఁప.

చ. వెఁడిరొ! యొగ్రకైక యఁటఁకు వెళ్లుము నుండెఁ దటాల్న నియ్యెడం
దొలఁగుము లేనిచోఁ గలుగుఁ దొందర లెట్టివియేని యింకఁ బైఁ
బిలువఁగ వచ్చు నీ వపుడు పేరిమిమై నట రాను వచ్చు, నిన్
దలఁచిన నీరు గాఁడె? యిటు తా వృథగా వెడలింప నేటికిన్. 73

క. అని యెన్ని చెప్పినను న, వ్వనిత వినదు దానియెడల భయభక్తులతోఁ
జను నాతఁ డేమి సేయు? నె? వనివశ మగు? దాని నచోటు వాయన్ జేయన్. 74

క. పదపడి లోఁకువ యగుటన్, గదలించెన్ సుకవి నిల్లు గదలి చనెడియా
త్మదయితు చందమ్మునకున్, మదిఁ దనదశకన్న వెలఁది మలమల మఱఁగున్. 75

క. అటు లొక్క రెండు దినములు, కటకట! యని యెల్లరనఁగఁ గలికి యనశన
స్ఫుటకఠినోపోషణముల, నటఁ గదలక యతనికరుణకై కాచునెడన్. 76

తే. గీ. కరుణ యొదవియు నాతఁడక్కలికి యెఱుఁగ, కుంఠవిధమున డాఁచి "యి
ట్లొంటినింటు, విడుచుపిమ్మటకలసిన డిదికెటుకు, రమ్మనినబుద్ధిగానుండురమణి" యనుచు

క. లోనెంచి దానినానా, నూనవిభూషణకదంబ మొకటి యొసఁగొన క
మ్మానినియులు చేర్పించియు, దానిజనని కిల్లువార్త దానంపించెన్. 78

క. నీకొమరె దుర్మదంపుం, బోకిళ్లను వాకు రోఁత పుట్టెఁ "జను" మనన్
వే కదలదు రెణ్ణాళ్లై, శోకించుచు లంఘనముల నుఱ్ఱుక్కుచు నుండెన్. 79

తే. గీ. దానియాస్తి యావత్తు నీదగ్గఱ కిపు, డంపితిని నీవు వచ్చి నీయాత్మజాతఁ
దీసికొనిపొమ్ము లేనిచో దీనిని బల, వంతముగ నిల్లు వెడలింప వలసి వచ్చు. 80

క. అనుమాట వినినయంతన, చని తా నవ్వేశ్యమాత జామాతను చే
ర్చినరీతి వేఁడికొని యాతనిచవుం గాన కంతఁ దనయున్ గనియెన్. 81

క. మెలమెల్లన బోధించియుఁ, జలమున రానొల్లననెడిచానన్ బలిమిన్
వెలికిన్ గొని చనె నదియు, వ్వేఁ దనయిలు సేరి లోన వగచుచునుండెన్. 82

క. ఇదియంతయు విని "దైవము, బ్రిదికించె న్నన్ను నాదుపట్టయి" యని య
మ్ముదిత యిలుసొచ్చెఁ గవ్యప్రకదు "దదియేమనునో" య నెడిశంక వెఱబడన్. 78

చ. కళవళమందుచుఁ బెకలఁ గందుచుఁ గుందుచు నున్నబోటి య
వ్వల వలపుఁ బొగండొటుకు వచ్చినయంతన తేటిచూచి వె
ల్వెల దిగఁద్రావి యాతనిచవిఁ బడి యుల్కుచుఁ సాగ నద్దిరే!
వెలచెలి కబ్బునవ్విరహవేదన లీఁద నళక్య మెట్లగుఁన్. 83

ఉ. "ఏమిటికై వరించితివొ యివ్వెడఁగుంగవిఁ దీరెఁగాదె! యా
యామద మెల్ల, నింకయిన నవ్వలి కంపక కొంప కేమటం
చీమెయి దూర్చెదే?" యనుచు వృద్ధ వెసన్ దలనోరు మొత్తుకోఁ
గోమలి లెక్కసేయకయ కూటములన్ గరఁగించు నక్కవిన్. 84

ఉ. ఆగతి నిర్భయంపుసుఖ మందుచు నాగజయాన లోన నా
నాగతి "నాప్రియుండిటుకు నాకయి నాఁ దనయుంత వచ్చు బ
ల్లోఁగినవాఁ డెటుల్ దలఁపులో ననుఁ బాయఁ గలండు దుర్మతుల్
వాఁగెడికూఁతలన్ విడుచువాఁడె! యతం" డని యెంచు నారెకున్. 85

చ. అచట నుదారుఁడున్ దరుణికై వగఁ జెందుచు నెప్పుడేనిఁ దా
న చని వెలందిఁ జూచుటకునై మది నెంచియు నట్టులెఁచొ
"సచివులు భృత్యులున్ మిగులఁ జౌకగ నెంతు" రటంచుఁ గొంకు "న
వ్విచికిలగంధి సాటి పదివేలను లే" రని లోనఁ జింతిలున్. 86

డోలాయమాన మగుమది, తో లీలలు దక్కి యతఁడు తొయ్యలిఫోటో
లాలోకించుచుఁ గుందుచుఁ, గాలమ్మును గడుపుచుండెఁ గళవళపడుచున్. 87

ఆరీతియొల్లఁ గని "య, వ్వారాంగన యిటకు మరల వచ్చుట తగ దం
చారూఢి నతనిమిత్రులు, వారించెడివారలను జూచువా రయి కడఁకన్. 88

తే. గీ. దానియప్పటివర్తనఁ దథ్యముగ నెఱింగి "యిప్పటికేని యీరంగులాఁడి
వాని వదలదు నీకు నీవంత యేల?, కావల నెనేనిఁ బట్టియీఁగలదు మేము" 89

అనుడు "నటులాచరించు నెకి, వనితకుఁ బొరపాటు మొదల వచ్చెనుగా క
ప్పని బుద్ధికృతము గా" దని, తనమదిలో నున్న తెఱఁ గతండు వచింపన్. 90

వారును నొకసమయము గని, యారామామణికిఁ గవికి నడుచేరిక క
న్నారంగఁ జూపంగ ను, దారునిరాగాంకురము మొదట్రికి నళించెన్. 91

తనతప్పిదమును బ్రియుఁడే, కన లారఁగఁ జూచుటయును గాంత యొకవిధం
బున నప్పుడు బొంకి నమ్మమి, నన రానికురుకు లెల్ల ననిపించికొనెన్. 92

చ. పదపడి యింక నాతనికృపన్ గడియించుట దుర్లభం బటం
చెదఁ దలపోసి యాన మొదలే నశియింపఁగ ధైర్యమంతయున్
వదలి "యిఁకేటిబెట్టుసరి! వైఖరి బోత్రిగఁ దప్పెనంచు న
మ్మదిత "యపాయ మిట్టి" దని మాటికి నెంచి కృతప్రియత్నయై 94

మ. తనకున్ దాసయి యొక్కరేయి యతనిన్ దర్శించి దీనాస్య యై
యనుమాన మ్మొకయింత లేక చరణమ్మందున్ శిరం బుంచి, పే
ర్మి ననున్ వేఁగరుణింపఁ దప్పదనుచున్ మే లెంచు మంచున్, వచిం
పనిదయ్యున్ స్ఫురియింపఁ జేసి కరుణన్ బాటింపమన్నంతటన్. 95

ఉ. కుందుచు నింటి కేగి దనమం గల తెల్వి యుదెల్ల దైన్యపుం
జందమునంద చేర్చి యొక జాబిటు వ్రాయఁగఁ బూనె నద్దిరా!
చందనగంధులెట్టిఘనసాహస మైన నొనర్చి బొంకి నా
గుం దమ చెయ్వలన్ వెనుకఁ ద్రొక్కఁగఁ జేయుదు రెట్టి కృద్ధునిన్ 96

క. య మ్మా రావ్రె గారికి, నమ్మినమీ దాసి చరణనతముఖినై దం
డమ్ములు సారెకు మ్రొక్కుచు, నిమ్మయి వ్రాసికొనుమనవు, లియ్యవి యయ్యెన్

చ. ఎనిమిదియేండ్లనుండి మిము నేక్షణమున్ బెడఁబాయనైతిఁ గా
దని తమ రూరికిన్ జనినయప్పుడు కాలము లెక్కపెట్టుచున్
దినములు ప్రచ్చ దాన నిదె దేవునిచెద్దియి నాలు నాళ్లనుం
డి సెనరు మాలి మీరు కరుణింపమి నీగతి నుంటి నొంటిగన్

క. ఇఁక నుండఁజాల నాచే, యీకుటిలచేష్ట లవి యెన్నియో మనమున లె
క్కకుఁ దా మెఱింగి యోజిం, చి కరుణ నిల్పఁ దగు నాదుజీవము తతితోన్

క. పేరేల చెప్పవలె నన్, బ్రేరేపించి రిటుమీరుఁ బ్రియము గలుగు నా
కారయ కాదుర్బోధకు, ధీరత్వము గోలుపోయితిన్ జెడితి నిటుల్

క. నాకర్మమ్మునఁ గలపని, యే కారణమైన నేమి! యిటు లోకపతిఁ దాఁ
జేకూరె నిక్క మిది పై, శోకించితి మొదలఁ దెలివి చొప్పడదయ్యెన్. 100

చ. తదుపరి యొంత యేడ్చినను దాఁ "జెయి గాలినమీఁద నాకులన్
పెదకుటు, వంటి దయ్యె ననుపీటేడి గా గణియించి యిట్టిబె
ట్టిద మగువంతకున్ జొనుపుచే యొకయాటగ నెంచి వారు న
న్నది పొనరింపఁ జేసి, రెవరైనను గర్మము దాఁటువారమే? 101

క. ఈగతి నాతల వ్రాసె వ్ర, థాగతి విధి, తలఁపు మిమ్ముఁ దపులమి నోరపై
రాగిల్లి మనఃపూర్వక, భోగము గావింప లేను పొరఁ బడి చెడితిన్. 102

ఉ. ఏకాలమందుఁ బుట్టితిని నిన్నిదినమ్ములనుండి మీకృపాం
బేకనివాస మాట నిఁక నిప్పుడుపుంగొలపుంగృపామ్మన
న్నారుఁ బదమ్ము లాగవు ధనమ్మను వద్దు మనమ్ము వద్దు నా
రాఁకి మమాత్రి మొప్పుము కరమ్ములు మోడ్చితి నేడ్చితిన్ సఖా.

చ. కడుపున కింత యన్నమును గట్టుకొనంగను బ్రాఁతచీరలే
నిడుఁ డిది చాలు నాయసువు లెంతకు నీచెడుమేన నుండు న
క్కడదనుకన్ భవచ్చరణకంజములన్ గనిపెట్టుకుండు నిల్
దుడిచెదఁ బ్రిక్కలన్ బఱతుఁ దొట్టికర్మము నెంచ్చుమన్ బ్రియా.

ఉ. ఇచ్చక మంచు నెంచకుఁ డిఁకెన్నఁడు నన్నను గూడ వద్దు పై
రచ్చను వ్రాసి యిచ్చెదను రాగి దుకాణియుఁ గోరకుండ లో
నచ్చదు నాకుఁ దల్లికిని నాథ? యెటుల్ వసియింతు నింట, నా
ముచ్చ టిదొక్కటే, చిగురుము ద్దిటు చెల్లఁగఁ జేయు మెమ్మెయిన్. 106

ఉ. మీ రెటు సేయు మన్న నటు మీఱక చేసెదఁ గన్నులార మి
మ్మారయు టొక్కటే వలతు నన్యము గోరను మీదు దాసి కీ
చేరిక నిచ్చి పాదములఁ జేర్పుఁ డదే పదివేలు దీని నిం
కేరికిఁ జూపకే పనుపుఁ డించుకవార్త, క్షమింపుఁ డన్నియున్. 107

క. ఇచ్చయొ యనిచ్ఛయో మీ, రిచ్ఛపలస్వాంత కిపుడ యేర్పఱుపవలెన్
బొచ్చెమ్ము వలవ దది మీ, యచ్చరములతోడ వ్రాయు టభ్యర్థింతున్. 108

క. అనివ్రాసియంపుటయు ద్వా, నిని గని యాతండు మనము నీరగుటయు మా
నినిఁ దలఁచి తలఁచి తనలో, ననుకొను నిక్కరణిఁ బ్రేమ మగ్గల మగుడున్

మ. అకటా! యంతటి దాని కిక్కరణి దైన్యం బింత వాటిల్లునే?
వికలత్వం బకటా! నృపాంగనగతిన్, వేమంది సేవించు దా
నికి దాస్యంబుచితంబె! యెంతవగపున్ జిత్తమ్మునన్ లేనిచో
నకి యీనీ సత కొప్పునే!, చెలిరో! పశ్చాత్తాప మిట్లున్నదే? 110

క. కానిమ్ము నిన్ను మరలన్, బూనికమైఁ గొన్న మొగముపొంతనె లోకుల్
"ఛీ! నింద్యుఁ" డనుచు నుమియరె!, నానేరం బేమి? యిపట్టు నాకీక్షణకో. 11[1]

# పాణిగృహీత.

ఉ॥ నీటును గోటునున్ దగిననేరుపు నోరుపు వన్నెచిన్నెలున్
దేటయుఁ దెల్వియున్ గలుగనెయ్యపుఁదొయ్యలు లెందఱేని నీ
పాటివెలందు లౌదురె? సెబాసు! బళా! వహావా! వహావ్వ! నీ
మాటలసౌరుతీరు గలమానిని నేను జగానఁ గానఁగా.

చ॥ గఱగఱ లాడుగాగరలు కంగులు రంగు లెసంగుచైకలున్
హారువును మర్వమం దగుపయంటలు పోడరు లత్తరుల్ విరుల్
కర మలరారుభూషలును గాక వెలందు లటంచుఁ గల్గిరే?
సరసిరుహాక్షి? మీకొలముచానలలో నిముఁ దక్క నొక్కెడన్. 112

చ॥ అగుదువు సోయగమ్ముగలయట్టివిలాసిని వైన నేమి? నీ
సొగసును జూపుకోపులును సుందరి! వ్యర్థము లంచుఁ జెప్పఁగా
దగు నది యేమనన్ వినుము తన్విరో? యోగ్యత లేనియప్పు డ
మ్మగువను బొందువాఁ డనగ మాలఁడో? మాదిగవాఁడో? గాఁదగున్. 114

తే. గీ. ఎంతసౌందర్యముండిన నేమిఫలము? యోగ్యత యొకింతగలుగని యువతిమణికి
నెన్నగ లెట్టివ్వాదయేశు. డెట్టిబిలుకుఁలుండినను బొట్టులేనన్న ముండయనరె?

తే. గీ. నిన్ను నిందించుకన్నను నన్ను నేన నింద యొనరించుటది సుంచిచంద మతివ !
గాన నావంటివిశ్వాసహీనుఁ డెందుఁ, గానరాఁడు జగమ్మునఁ గలికిమిన్న.

ఉ. ఎందఱినైనఁ జూచితి నికెందఱినైనను జూడనుంటి నో
సుందరి! నీదుచందమును సొంపును నింపు దలంపు నింపు నే
మందు! నవారవిందవదనా? పద నామొద నాటఁ బోకు నీ
కుం దగునందకానిఁ గయికొందువు నా కయి కుందనేటికిన్.

క. అని యచ్చెలి తనయెమటున్, గనుపట్టఁ బ్రభాతి దోఁపఁగాఁ బల్కెడియా
తనిచందము గని దూతిక, యను, "నయ్యా! నన్నుఁ బంపరా! యిఁకనైనన్". 117

క. దానఁ దెలివొంది "తనయ, జ్ఞానభరం బది యొతింగెఁ గా!" యని లజ్జన్
లో నొందుచుఁ "జను ముత్తర, మే నీ తే" దని వచింపు మేటికిఁ దడయన్,

చ. అన నదియేగ, నంతవల నా జలజాక్షియుఁ "బోయి దూతి రా
దనుకొను లేఖ తెచ్చునొకొ? యంచుఁ దపించు "నోసంగమందు నే?"
యని ధృతి గాంచు "నట్టిచడిమాసల" యంచు నిరాశ నించు "దే
నిని ధిని ప్రాణముల్ విడుతు నే" నను కొంచుఁ గశించు పందులన్. 119

ఉ. నేర్చియు నేరనో యిటుల నే నొనరించితిఁ దప్పు, దాన బల్
పేర్చినయాగ్రహమ్ము మెయిఁ బ్రేమ యొకింతయు లేక యింత న
న్నేర్చునె! భార్య నే? పడపుట్టింతిని గానె? యిదెంత దోస మీ
చర్చ యదేల? యాతనికిఁ జచ్చి యశమ్ము నఁగూర్చు టొప్పదే. 121

క. అని కృతనిశ్చయయై విషమును సిద్ధము చేసికొని యమోఘవ్యవసా
యనిబద్ధచిత్తయై యుండునెడఁ దటి కేగి యయ్యనుంగుఁ జెలియున్. 122

క. "ప్రియ్యుత్తర మీ లే" దన, నత్యంతామర్షఘూర్ణితాంతరయై "ప్రా
ణత్యాగమె వర మిఁక సం, స్తుత్యనుగుణంపుబ్రతుకు చొప్పడ నేలా?

క. మును వేశ్య లొక్కకొందఱు, తనువుల్ విటుతోడ వీడి తద్దయుఁ గీర్తిన్
గొని రేను విటునియనుమతి, కని ప్రాణం బూడ్చి సుచిరయశముం గొందున్

క. అని మరల మనము వెదఁదీ, సినఁ దత్తరపాటు దక్కి చెలి సంక్షేప
మ్మునఁ దనయుద్యమమును నా, తని కీగతి వ్రాసెఁ దెగువ దైవారంగన్.

ఉ. ఇంతకు మున్ను మీకు లిఖియించిన కమ్మప్రకార మేను మీ
చెంత భవత్పదాబ్జములసేవకునై బ్రదుకన్ దలంతు నో
కాంత! బహూక్తు లేల? యది కష్టమొ? యిష్టమొ? నేఁటిరాత్రికే
పంతము మాని తెల్పు టది బాగని యెంచి నమస్కరించితిన్. 125

క. అని వ్రాసి మరల నంపినఁ, గనుఁగొని లోలోన నతఁడు కరుణావాఢమియున్
వెనువెంటఁ గోపముబ్బఁగఁ, దనలో దా నిట్లొకింత తల్లడ మందున్. 126

ఉ. చచ్చుట నిక్కమే యగు విశాలవిలోచన, చాక యుండఁ గా
కిచ్చుట కెట్లు కాఁ దగు? నిహీ! యని యెల్లరు నవ్వరే? సరే
యచ్చటులాక్షి యాపయిఁ గులాచరణం బొనరించి కాలముం
బుచ్చుటకన్నఁ జచ్చుటయె పోలికడు మేలగు నెన్నిభంగులన్. 127

వ॥ అని యద్దానిం దలంచుకొని.

ఆ. వె. ఇపుడు చావ నేల? యింతకు మున్న చ,చ్చినది నీవ కాదు చెలియ మిన్న
వీఁడు నట్టివాఁడె, ఖేదమ్ము గ్లునే?, మనకు నెన్నఁడేని వనజనయన. 128

ఉ. పుట్టరే? గిట్టరె? జనులు పుట్టిన నేమగుఁ? గిట్ట నేమగున్?
గట్టుపవర్తనమ్ము చెడి శాపథవర్తను లైనవారి కె

ప్పట్టున సౌఖ్య మందఁ దథవా యొకపట్టునఁ గల్గుఁగాక దా
నిట్టిద యౌ నిసీ! చెడితి నెమ్మియి నన్ జెడఁగొట్టి తంగనా.

మ. గృహిణీవర్తనమందు నీవుఁ గలరక్తిన్ గాంచి నీహేతువై
"బహుదుశ్శీలము మీకొలమ్ము గుణముం బొట్టించు" నం చెంచితిన్
మహిళారత్నమ! యన్నియున్ మృషలె నీమాటల్ సెబా! సింతకున్
బహి పెట్టన్ బడి ప్రాణ మూడ్చు మనుచున్ వ్రాసెన్ విధాత్యం దహో.

ఉ. ఏనును జీవ మూడ్చుకొనుకే ప్రియతింతునో? దాన నేమగున్?
మానిని! యోఁడుదాని కది మన్ననఁ దెచ్చెడునట్లు పూరుషుం
డేని నొసంగఁ డెక్కరణి నిన్ విడియుందుదు నేమొగమ్ముతో
నే నిసుఁ బూర్వమున్ బలె గణింతు? ఘటింపవు రెండునున్ జెలీ. 182

క. అని యత్తుది నాబునకును, దనప్రత్యుత్తరము నిడక తరుణీమణి దూ,
తిని నంపుడు దా నచ్చెలి,విని యాపై నొడలు వీడ విసమున్ మెసవెన్. 183

క. అక్కటతన నత్తలోదరి, మిక్కుటముగు నాత్రిగూరి మృతి గనుటయు నీ
వెక్కసపువార్త విని మది,నెక్కుడు చింతించె నాతఁ డిదియొప్పదొకో. 184

చ. అయ్యదియెట్టిదైన, హృదయంబు సదా తదధీనమౌ గతిన్
నెయ్యముమై మెలంగునలనీటు వెడంగుబోఁటుంగు నేఁటిక
త్తొయ్యలి యాత్మ హేతువున దుడుక్కుమెయిన్ మృతిఁజెంద నెంతగా
దయ్యమునేఁతికై వగచి తాళఁగలే కెదఁగుందఁగావలెన్. 185

క. పగవారల మృతికైనను,దగువారలహృదయమునకుఁ దాపము దవులున్
మిగులఁ బ్రియమైన యాసో,దగఁ బుంగని కతఁడు శోకమందుట తగదే! 186

చ. అరసితిరే? యుదారగతి, యక్కట! యొంతకు వచ్చె! ద్రవ్యమా!
నురిగ యశంబు గంగఁబడెఁ జొక్కపు మేని పసం దడంగ దు
ర్భరమగు పాతకం బొకటి పైఁబడె దుఃఖములోడిపా టహో
దురితపుసంత వారసతిలోఁ దగునే? తగులాట మేరికిన్. 187

వ. పదపడి యమ్యుదారుండును.

ఉ. దానిప్రసక్తిమెల్ల దిగఁద్రావి స్వకీయపురమ్ముఁ జేరి యా
పైని స్వభార్య దాను నొకపాటి గృహస్థులపోలె నుండి ర

జ్ఞాన మదెల్లఁ బోయె భవసాగర మెందు నసార మంచు లో
లో నెటిఁగెన్ మఱియెవ్వెడల లోలుఁడు గామియు దానఁ జేసి యెన్. 138

క. ఆపయి వేశ్య లనినఁ ద,ద్వ్యాప్తి గలవార లనిన నత్యధికాసూ
యాపరుఁడై చూచు స్వ,లోపములన్నియును దలఁచి లో లజ్జించున్. 139

చ. తనభయ మింత లేమిని యదాయద లౌనలయగ్రహారముల్
గనుఁగొని వానిపై ఋణము గల్గుటకున్ మది రోసి వానిసె
ల్లను వెసఁ దీర్చి తల్లి తనలక్షణముల్ గని సంతసింప నీ
తిని గనె నెల్లభంగుల సుదీర్ఘయశం బనిశంబు గ్రమ్మఁగన్. 140

గద్య.

ఇది శ్రీకింకవీంద్రఘటాపంచానన విద్వత్కవిబాలకళానిధి
బాలసరస్వతీ శతావధానితిరుపతివేంకటేశ్వరులచే
రచియింపఁబడిన పాణిగృహీతయందు

సర్వమును

షష్ఠాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

సంపూర్ణము.

